

# మెహెర్ మందారం

జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు

# మెహెర్ మందారం



: సంకలనం :



జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు




అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు

మచిలీపట్నం

# MEHER MANDARAM

Compiled by

G. V. G. K. CHANDRAMOULESWARA RAO

September 1984

PRICE: Rs. 4-00

For Copies :

G V. G. K Chandramouleswara Rao
29-36-12, Museum Road, VIJAYAWADA-2.

OR

AVATAR MEHERBABA MACHILIPATNAM CENTRE
Machilipatnam-521 001

Printed at :

SPANDANA PRINTERS
Machilipatnam-521 001

# తొలి పలుకు

జై బాబా! ప్రేమిక సోదరులకు మనవి. ఈ పుస్తకము యింత సర్వాంగ సుందరంగా అతి త్వరలో పూర్తియగుట ముదావహము. ఎంతో మంది గొప్ప గొప్ప మంచి పుస్తకాలు పదివేల సహాకార సంపత్తులతో ప్రచురిస్తారు. కానీ చదివి ఆనందించే వారికంటే బీరువాల్లో దాచేవారే ఎక్కువ మంది వుంటారు. దీనికి విరుగుడుగా బాబా ఈ పుస్తకం ప్రచురణ పూర్తికాక మునుపే అందలి విషయములు బహుజన ప్రేమికులకు తెలుసుకొనేటట్లుగా చిన్న చిట్కా ప్రయోగించారు.

ప్రతివారం వీలు ప్రకారం ఒక ఫారం బాబా సూక్తుల్ని అచ్చు వేయించటం, దాన్ని పోస్టు ద్వారా కానీ, వ్యక్తిగతంగా కానీ ఆంధ్ర బాబా ప్రేమికులకు అందజేసే కృషి మా సెంటరు ద్వారా జరిగింది. వీలైనంత వరకు మెహెర్‌బాబా సెంటరులకు, ప్రముఖ దైవ ప్రేమికులకు కొన్ని ఫారాలు పంపుతూ ప్రేమికుల కందీయవలసిందిగా కోరియున్నాము. సామాన్యంగా మెహెర్ సెంటరు యొక్క అధ్యక్షులుగానీ, కార్యదర్శులుగానీ, బహు మేధావులై యుంటారు. అందులో చాలామందికి యీ ప్రచురణలలోని విషయములు బాగా తెలిసియుండుట చేత వాటికి ప్రాముఖ్యం యివ్వక సెంటరులో ఏమూలో పడవేసివుండ వచ్చును.

కానీ కొంత మంది ప్రేమిక సమావేశాల్లో యిందులోని సూక్తులన్నీ చదివి వినిపించినట్లు మాకు తెలిసింది. మేము పదే పదే వ్రాయగా కొందరు మాత్రం కొద్ది మందికి అందజేయుట

జరిగినట్లు తెలిపారు. ఏది ఏమైనా బాబా కృప వలన చాలా మంది ఆమోదం పొందినట్లు ఎందరో వ్రాసిన జాబుల వలన తెలిసింది. మా కృషిని శ్లాఘిస్తూ కొందరు వ్రాసిన జాబులు మాకు ప్రోత్సాహాన్నిచ్చాయి.

చాలా మంది ఆర్థిక సహకారం కూడ అందించి ప్రోత్సాహపరిచారు. వారందరికీ మా సెంటరు తరుపున ధన్యవాదములు. బాబా కృపా కటాక్షములు నా యందుంటే అందరికీ అర్థమయ్యే రీతిలో, వ్యావహారిక భాషలో, శ్రీ చంద్రమౌళేశ్వరరావుగారి అనువాదంతో భగవద్వచనములు తదుపరి ప్రచురణగా అందచేయాలని సంకల్పిస్తున్నాము. ఉత్సాహం కలవారు తగు చేయూత యిచ్చి తమ సలహా సంప్రదింపులందించి బాబా సత్య ప్రేమ సందేశాలింకా విరివిగా అందించ కలుగునట్లు ప్రోత్సాహపరచ కోరుతున్నాను.

దీని కంతకీ బాబా అభీష్టమో అన్నట్లుగా గుడివాడలో ఉద్యోగం చేసే శ్రీ ఓ. పి. జి. కె. చంద్రమౌళేశ్వరరావు గార్ని అనివార్య పరిస్థితులలో కూడ బందరుకు మార్చి తగు వ్యవధి కలుగచేసి వారియొక్క అన్ని రకాల సహకారములు గుప్తముగా అందచేసేట్లు బాబా చేసినారు. ఈ పుస్తక సంకలనంజయప్రదమగుటకు అదే పునాది. సంకలనంలో వాడిన భాష, శైలి సామాన్య చదువరులకు కూడ తేలికగా అర్థం కాగలదని విశ్వసిస్తున్నాను.

ఇట్లు

తాడేపల్లి బసవయ్య

అధ్యక్షులు

అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు

మచిలీపట్నం

20-9-84

√

# విన్నపము

అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరువారి ప్రోద్బలంతో ఇప్పటికే నా రచనలు కొన్ని ఆంధ్ర బాబా ప్రేమికుల కందించటం జరిగింది. మీరు చూపిన ఆదరణకు ఎంతయో కృతజ్ఞుడ్ని. బాబా సాహిత్యానికి సంబంధించిన రచన లెన్నో తెలుగులోకూడ వెలువడ్డాయి. ఆధ్యాత్మికోన్నతికి బాబా యిచ్చిన సందేశాలు, సూక్తులు మరెన్నో ఆంగ్ల భాషలో వుండి సామాన్యుల కందుబాటులో లేవు.

అదీ కాక వివిధ సందేశాలు, వేర్వేరు గ్రంథాల్లో ప్రచురించబడి వున్నాయి. నిజజీవితంలో మనం నిత్యం ఎదుర్కొనే జీవిత సమరంలో మేల్కొలుపు గావించుట కుపయోగపడగలవన్న వుద్దేశ్యంతో వాటిలో కొన్ని సూక్తుల్ని, హెచ్చరికల్ని, సందేశాల్ని ఏరి కూర్చి దండగా మెహెర్ మందారాన్ని తీర్చిదిద్దాము.

దీన్ని వారం వారం కార్యక్రమంగా చేపట్టి ప్రతి శుక్రవారం నాటికి ఒకటి రెండు బాబా సూక్తుల్ని ఒక ఫారంగా అచ్చొత్తించి తోటి బాబా ప్రేమికుల ఇళ్ళకు చేరేట్లు చేశాం. ఫారం అందగానే చదివి ఆనందించి మళ్ళీ శుక్రవారం ఏ విషయం ప్రచురిస్తారోనని ఎదురు చూస్తున్నామని కొందరు ప్రేమికులు జాబులు వ్రాశారు. నిజానికి మా ధ్యేయం అదే. పుస్తకం ఆసాంతం ఆతురతతో చదివినట్లవుతుంది.

ఈనాటి పరిస్థితులు పుస్తక ప్రచురణకు క్లిష్టంగా వున్నాయి. కాగితం ధర విపరీతంగా పెరిగిపోయింది. అయినా బాబా దయవలన నాకు అత్యంత ఆప్తులైన మిత్రులు శ్రీ గుత్తికొండ సుబ్బారావుగారు (స్పందన ప్రింటర్స్, మచిలీపట్నం) అందించిన సహకారం మరువలేనిది. ఎన్ని పనులున్నా సకాలంలో ప్రతి పత్రిపారం విడువకుండా ఒక ఫారం ముద్రణ అచ్చొత్తించి అందించ గలిగినందుకు వారికి నా హృదయపూర్వక ధన్యవాదాలర్పిస్తున్నాను.

ముఖ్యంగా యీ కార్యక్రమం జయప్రదంగా నిర్వహించుటకు తమ అమూల్య సహకారాన్నందించిన పూజ్యులు శ్రీ తాదేపల్లి బసవయ్యగారిని విస్మరించలేను. అనారోగ్యంలో వుండికూడ ప్రచురణ గురించి వాకబు చేసి అనవాయితీ తప్పకుండా సకాలంలో అందించేందుకు ఆయన చూపిన శ్రద్ధ మరువలేనిది. బాబా కార్యక్రమాలంటే ఆయన అత్యంత ప్రాధాన్యత నిస్తారు. ఇటీవల ఆయన తీవ్ర అస్వస్థతకు గురయ్యారు. అందులోనే ఆయన జన్మదినం వచ్చింది. సెప్టెంబరు 5న ఉపాధ్యాయ దినం. ఆరోజే ఆయన జన్మదినం కూడ. అందువలన ప్రతి సంవత్సరం స్థానిక రోటరీ క్లబ్బువారి ఆధ్వర్యంలో బాబా సెంటరులో అనేక బాబా కార్యక్రమంగా ఆయన జన్మదిన వేడుకలు జరుపుతారు. అదేమాదిరి యీ సంవత్సరంకూడ తాను గుండెపోటు వచ్చి తీవ్ర అస్వస్థతలో వున్నా బాబా సెంటరులో జరిగే జన్మదిన కార్యక్రమం యధావిధిగా జరిపించిన ఆదర్శమూర్తి.

సహృదయులైన యీ క్రింది బాబా ప్రేమికులు తమ భూరి విరాళాలొసగి యీ చిన్ని ప్రయత్నంలో తమ సహాయ మందించినందుకు వారందరికీ నా కృతజ్ఞతలందిస్తూ బాబా కృప వారిపై ప్రసరించాలని ప్రార్థిస్తున్నాను.

1. శ్రీ కన్యకాపరమేశ్వరీ రైసు మిల్లు
   కాంట్రాక్టర్సు కంపెనీ, మచిలీపట్నం రు. 100-00
2. శ్రీమతి తాడేపల్లి సీతామహాలక్ష్మి, మచిలీపట్నం 100-00
   (కార్యదర్శి, మహిళా సెంటరు)
3. శ్రీ తాడేపల్లి హనుమంతరావు,
   ఆంధ్రా బ్యాంకు, విజయవాడ 100-00
4. శ్రీ ఇమ్మడి మధుసూధనరావు, మచిలీపట్నం 100-00
5. శ్రీ పి. వెంకటరావు, కార్యదర్శి
   అవతార్ మెహెర్ బాబా నివగాం సెంటరు 100-00
6. శ్రీ నరహరిశెట్టి రమేష్, రామానాయుడుపేట 5-00
7. శ్రీ కర్పూరపు సుబ్రహ్మణ్యం, కాకినాడ 19-00
8. శ్రీ సత్యనారాయణ, కాకినాడ 6-00
9. శ్రీ ముంమూరు నాగేశ్వరరావు, చల్లపల్లి 100-00
10. శ్రీమతి సామా శకుంతల
    W/o సామా వెంకటసుబ్బారావు
    బాబు & కో, మచిలీపట్నం 100-00

11. శ్రీమతి ఎమ్.ఎస్. మణిశంకరరెడ్డి, మచిలీపట్నం 100_00

12. శ్రీమతి పి. మంగమణిరామిరెడ్డి, హైదరాబాదు 100_00

13. శ్రీ పి. వి. నాగేశ్వరశర్మ, మచిలీపట్నం 50_00

14. శ్రీ పాలకుర్తి బాపనరావుగారు, మచిలీపట్నం 10_00

15. శ్రీ తటవర్తి గోపాలకృష్ణమూర్తి, మచిలీపట్నం 5_00

16. శ్రీ తాడేపల్లి మెహెర్ బాబా, మచిలీపట్నం 10_00

17. శ్రీ కొంకిమళ్ళ హనుమంతరావు, హైదరాబాదు 125_00

18. శ్రీమతి పాలపర్తి సీతామహాలక్ష్మమ్మ, బందరు 50_00

19. శ్రీ ఆర్. గిరిధరారావు, విజయవాడ 20_00

20. శ్రీ విడియాల వెంకటేశ్వరరావు, మచిలీపట్నం 100_00

21. శ్రీ కొల్లిపర సూర్యనారాయణ, విజయవాడ 120_00

22. శ్రీమతి కె. చంద్రావాయమ్మ, ఆంధ్రా బ్యాంకు, విజయవాడ 100_00

23. శ్రీ వి. ఎస్. వి. వి. కృష్ణారావు, ఏలూరు 20_00

వెరశి 1540_00

-: జై బాబా :-

మచిలీపట్నం ఇట్లు

20_9_84 జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు

# 1. ప్రేమికులకు - మెహెర్‌బాబా హెచ్చరిక

1957 మే 19 వ తేదీన, బాబా ఆజ్ఞ ప్రకారం, పూనా గురుప్రసాద్ భవనంలో, బొంబాయి, పూనా గ్రూపులకు చెందిన బాబా ప్రేమికులు, మండలి సభ్యులు దాదాపు 47 మంది సమావేశమైనారు. ఆనాటి సమావేశంలో బాబా తన సహజ గంభీర శైలిలో చిరునవ్వు నవ్వుతూ, అందరి కుశలము లడిగిన పిదప, తాను చెప్పబోవు హెచ్చరికను, శ్రద్ధతో జాగ్రత్తగా వినమని హెచ్చరించారు.

“మీరంతా బాగా జ్ఞప్తి వుంచుకోవలసిన ముఖ్య విషయాన్ని, నే నీ రోజున మీకు చెప్పదలచుకున్నాను. ఈ జగత్తంతటికీ నేను సార్వభౌముడ నన్నది నిజం. నేను సర్వ వ్యాపకుడను. నేను మళ్ళీ మళ్ళీ, యీ రక్త మాంసాదులతో మానవజన్మ ఎత్తి సమస్త మానవాళి బాధలను భరించుటకై మీ మధ్యకు రావలసి వున్నది. చాలా సంవత్సరాలుగా మీరంతా నన్ను పూజిస్తున్నారు. కానీ నేను పరాభవం పొందే సమయ మాసన్నమౌతోంది. అప్పుడు మీరెంత గట్టిగా నా కొంగు పట్టుకున్నా జారిపోయే అవకాశం వున్నది. మీరు నన్ను వదలి పోవుటకు కూడ వెనుకాడక పోవచ్చును. మరి అలా జరుగకుండా వుండాలంటే ఒకటే మార్గం. నేను చెప్పేది జాగ్రత్తగా విని, గ్రహించి, నడుచుకోవాలి. నా కొంగు మీ చేతుల నుండి జారకుండేందుకు మీ కిచ్చే ప్రేమపూరిత హెచ్చరిక యిది.”

“ ఈ జగత్తంతటినీ కాపాడుతూ, దైవంగా భాసిల్లే పంచ సద్గురువు లున్నప్పటికీ, వారంతా కలసి, మానవాళి బాధల్ని భరించేందుకు, భగవంతుడ్ని అవతరింపచేస్తారు. ఈ యుగపు పంచ సద్గురువులచే, సమస్త మానవాళి బాధల్ని మోసి, వ్యధను అనుభవించుటకై, యీ నా మానవ రూపం తీసుకోబడింది. సనాతనుడనైన, నేను మానవ రూపం ధరించిన ప్రతిసారీ, అసత్యపు గురువు లెందరో తయారై, తామే అవతారులుగా కూడ ప్రకటించుకుంటారు. యిది యుగ యుగాలుగా జరుగుతున్నదే. ముఖ్యంగా గురువుల గురించి ఎందుకు చెబుతున్నానంటే, వారంతా నా బిడ్డలే కనుక, నా కా హక్కున్నది. ”

“ మీకు సంబంధించినంత వరకు, మీరే గురువును విమర్శించరాదు. పరోక్ష నింద అసలే చేయవద్దు. యదార్థ గురువులను గురించి మీరు చెడుగా మాట్లాడితే, అది మీకు చాల చెడు చేస్తుంది. భయంకర సంస్కార బంధాలను సృష్టించు కుంటారు. యోగులైన మహాత్ము లుండవచ్చును. ఎవరు యదార్థ గురువో, ఎవరు అసత్య గురువో తెలుసుకొనుట మీకు కష్టం. అందుచేత ఏ గురువు పైనా దుష్ప్రచారం చేయకండి. స్వయం ప్రకటిత గురువులు యదార్థ గురువులుగా చలామణి కావచ్చును. వారి మధ్య తేడా మీరు తెలుసుకోలేరు. యోగి కావటమంటె చిన్నపిల్లలాట కాదు. నగల వ్యాపారి మాత్రమే, అసలు–నకిలీ ముత్యాల మధ్య తేడా ఎలా గ్రహించ కలుగునో, అలా, నేను మాత్రమే అసలు–నకిలీ గురువుల తేడా తెలుసుకో గలను. ”

" ముఖ్యంగా భారతదేశంలో నకిలీ గురువుల నెక్కువగా చూడగలం. వేదాంతం అధికంగా పఠించినందున అలా జరుగుతోంది. సద్గురువు " నేను భగవంతుడ్ని " అని చెప్పినట్లే నకిలీ గురువు కూడ తాను చదివిన వేదాంతసారాన్నిబట్టి " నేను భగవంతుడ్న"ంటాడే కాని, అంతర్గతంగా అనుభవించడు. ఇది వట్టి మోసం. నిజానికి తాను యదార్థ గురువు కానప్పటికీ, యితరుల పొగడ్తలకు, ఆరాధనకులోనై, తనకు తానే గొప్పదనాన్ని ఆపాదించుకొని, గురువుగా చలామణి అవుతాడు. ఇతడే నకిలీ గురువు. అయితే బాహ్యంగా అతడ్ని నకిలీ గురువుగా మీరు తెలుసుకోలేరు. అంతర్గతానుభవంలేని ఇట్టి నకిలీ గురువు లెన్నో జన్మలెత్తాలి. "

" నకిలీ గురువులు, తమ నాకర్షించుటకు, ఆశ్రమ వాతావరణంలో ఎన్నో సృష్టిస్తారు. కొందరిలో కొన్ని అనుభవాలు కూడ కలుగవచ్చును. అంతమాత్రంచేత, వారు యదార్థ గురువులు కాలేరు. సాక్షాత్తు భగవంతుడు మానవ రూపధారియై, మీ మధ్య వున్నప్పుడు, మీకు గురువులతో పనేమిటి ? వారంతా సముద్రపు వొడ్డున దొరికే నత్తగుల్లల వంటివారు. మెరిసే వాటికి ఆకర్షితులై బీచ్‌లో తిరిగేవారు ఏరుకొని, " ఆహా ! సముద్ర సంపద, నేనే కదా ! పొందాను " అనుకుంటారు. అయితే ఆ నత్తగుల్లలు అరుదుగా దొరికే ముత్యాలవుతాయా ? నేను రారాజును. అనంత ధనాగారాని కధిపతిని. నా కొంగు గట్టిగా పట్టుకొని, అన్యచింతలకు తావీయక, మనస్సును కుదుట పరచుకోండి. అనవసర ఆందోళనలతో గురువుల వెంట పడకండి. నాపై మీకు నమ్మకం లేకపోతే నన్ను వదలి, వేరొకరిని వెతుక్కోండి. అయితే, నిలకడలేని మనస్సుతో, నా దైవత్వాన్ని

శంకించి, నన్నంటిపెట్టుకొని వుంటే, మీ పని అడకత్తెరలోని పోక వలె అవుతుంది. "

" భగవంతుడు మానవ రూపధారిగా యీ భూమిపై అవతరించినప్పుడు, ఆయనతో అనుబంధం పొందే భాగ్యం కలిగి నందుకు, మీరెంతో అదృష్టవంతులు. మరి ఆయన బిడ్డలైన గురువుల వెంట ఏల పడెదరు ? భజనలు, క్రతువులు, కర్మ కాండలు, పూజాధికాల వలన, కలిగే ఆధ్యాత్మిక వాతావరణానికి ఆకర్షితులగుట చాల తేలిక. ఇవేవీ, ముక్తి మార్గాన్ని చేర్చలేవు. పై పెచ్చు, యీ కర్మకాండలన్నీ మీ మార్గాన్ని తప్పించి, తప్పుదారి పట్టిస్తై. అందుకే నేను వాటికో ప్రాధాన్యత యివ్వక, ఎప్పుడూ మీతో ఆడుతూ పాడుతూ, చతురోక్తులతో సరదాగా వుంటాను. "

" నిజానికి, మరుగున వుండే, నిజమైన గురువులు కొంద రున్నారు. నా దైవాధికారంతో చెబుతున్నాను. వీ రెవరూ కూడ ఆత్మ సాక్షాత్కారం పొందలేదు. వారి మాటలకు, ఆకర్షితులై మోసపోకండి. యింత సుదీర్ఘ హెచ్చరిక సార మేమంటే, మీరు నా కొంగన్నా పట్టుకోండి, లేదా నన్ను పూర్తిగా వదలి వేయండి. యిందులో బేరానికి తావు లేదు. ఏమైనప్పటికీ, పంచ సద్గురువుల సమాధులు దర్శించుటకు, మీకు స్వేచ్ఛ వుంది. తదితర ప్రదేశాల్ని, గురువుల్ని దర్శించకండి. అసలు గురువు ఎవరో, నకిలీ ఎవరో మీరు పోల్చుకోలేరు. కనుక, ఒకవేళ మీరెవరైనా గురువును కలుసుకొనుట తటస్థ పడితే, వారిని

గౌరవించండి. గౌరవ ప్రపత్తులందించండే కానీ, వారివెంట పడవద్దు. విమర్శించవద్దు. నా యందు పరిపూర్ణ విశ్వాసముంటే, నన్నంటిపెట్టుకొని వుండండి. లేదా నన్ను పూర్తిగా వదలి వేయండి. "

" నేను భగవంతుడ ననేది నిజం. నేను సర్వోన్నతుడను. మీ మంచికై, నా కొంగు గట్టిగా పట్టుకోండి. నా ప్రేమికు లెవరూ, యితర గురువుల దర్శించ నవసరంలేదు. పరాభవ కాలంలో కూడ, నన్నంటిపెట్టుకొని వుండండి. నా ప్రేమ సందేశాల్ని దశ దిశలా వ్యాప్తిచేసి, బాబా సేవలో ధూళిగా మారండి. "

## 2. బాబా కార్యక్రమం అంటే!

బాబా కార్యకర్తలు చేయవలసిన పనిని గురించి బాబా చెపుతూ, " తన కార్యక్రమ మనేది అత్యంత నిజాయితీతో, ప్రేరణతో, ప్రేమతో చేపట్టినప్పుడే అది బాబా కార్యక్రమ మౌతుంది. అలా పనిచేసే కార్యకర్తలే బాబా మనుషులౌతారు. నిస్వార్థ సేవ చేస్తూ జీవనం గడపాలి. అందులో అణుమాత్రం కూడ నటన పనికిరాదు. యితరులకు ఆదర్శంగా వుండాలి. బాబా ప్రేమ అందరిదీ కనుక, కేవలం మాటలతో కాక, బాబా ప్రేమను, సందేశాల్ని ఇతరుల కందించుటకు ముందు నిజానికి వారు అనుభవిస్తూ మోయాలి. " అన్నారు.

" ఇతరులకు మీరేమి చెప్పదలచినా, స్వయంగా ముందు ఆచరించాలి. లేకపోతే యితరులకేమీ చెప్పకుండుట మంచిది. నీవు గడిపే అసలు జీవితం, యదార్థ వుదాహరణగా వుండాలి. బహు ఆదర్శంగా నీవు నీ జీవితాన్ని గడపాలి. నీ నిజ జీవితంలో ఆచరించలేని దానిని, ఇతరులకు చెప్పే ప్రయత్నం చేయకుండుట మంచిది. కష్టపడి, బ్రహ్మాండమైన కార్యక్రమం చేసి పెద్ద సమూహాన్ని పోగుచేసినా, నీ నడత ఆదర్శప్రాయంగా లేనప్పుడు, అది బాబా గొప్పదనాన్ని పెంచుతుందా ? "

" ఎన్నో యుగాలుగా, భారతదేశమంతా, ఆధ్యాత్మిక వాతావరణం నెలకొని వున్నట్లు మనకు తెలుసును. గడ్డాలు, మీసాలు పెంచుకున్న సాధువు లెవరు కనపడినా గౌరవిస్తారు. ఎవరైనా అలా చేసినప్పుడు, ప్రక్కవారు అతడ్ని అనుసరించి, ఆ గడ్డాలవాణ్ణి గౌరవిస్తారు. అలా చేయుటలో ఎన్నో అనర్థాలు రావచ్చును. కనుక బాబాను ప్రేమించేవారు, ఆయన చెప్పిన జీవితాన్ని ఆచరణలో పెట్టి జీవించేవారు, బాహు కొద్దిమంది మాత్రమే ఎంచుకోబడినా, వారు ప్రేమను సృష్టించి, బాబా ప్రేమ యొక్క సందేశాల్ని పదిమందికి వెదజల్లగలరు. అదే బాబా యొక్క యదార్థ కార్యక్రమం కాగలదు. "

బాబా చెప్పారు—" యితరుల కొరకు నే నిచ్చిన ప్రేమ సందేశాల్ని మీ స్వంత జీవితంగా తీర్చిదిద్దుకోండి. నన్ను ప్రేమించే ప్రతి హృదయం నా ఆశ్రమం. మీరు, యదార్థ బాబా ప్రేమికునిగా జీవించాలి. నన్ను ప్రేమించుటతో సరిపోదు.

మీరంతా ఒకరి నొకరు ప్రేమించుకోవాలి. యితరులకేమి బోధిస్తున్నారో దాన్ని మీ జీవితంలో సాధన చేయాలి. జనాల్ని ప్రోగుచేయటం ముఖ్యం కాదు. అది నిష్ఫలం. మీ మధ్య ప్రేమ, నమ్మకం వుండాలి. "

" మీ రలాంటి పని చేయకలిగితే చేయండి. చేయలేనప్పుడు, అసలట్టి పని జోలికి పోకండి. ప్రతి ప్రేమికుని యొక్క హృదయం బాబా యొక్క విగ్రహంగా మలచండి. మీ రా విగ్రహానికి పూజారులు కండి. " ప్రతి ప్రేమికునికి బాబా యిచ్చే సలహా ఒక్కటే. కార్యకర్త లొకరి కొకరు ప్రేమించుకోవాలి. ఆ తరువాతనే ప్రేమను గురించి యితరులకు చెప్పాలి. ముందుగా ప్రేమను మీలో పాదు చేసుకోవాలి.

బాబాకు ముఖ్యమైన దేమంటే, ప్రేమ ముఖ్యం హృదయం ముఖ్యం. సంపద, పేరు ప్రఖ్యాతులు తెలివితేటలు కాదు ముఖ్యం. ప్రేమ, హృదయం, ఋద్ర, సంపద. ఇవన్నీ కలిసి, అచరణ యోగ్యాలవుతున్నాయి. " మీరు నన్ను ప్రేమించాలని ధైర్యం వహిస్తే, మీ కమిటీలోని సభ్యులు కానివారు, కమిటీ సభ్యులు కంటే బాగా చేయగలమని వారికి చేతలలో చేసి చూపాలి. సెంటరు కార్యకలాపాలు నిర్వహించే కార్యకర్తలు తక్కిన ప్రేమికుల కంటె గొప్పవారని అనుకోకండి. బాబా ప్రేమ సందేశాల్ని వ్యాప్తిచేసే కార్యక్రమం మీరు కూడ చేయవచ్చును. "

" ఒక్కటి మాత్రం బాగా గుర్తుంచుకోండి. మీరు నిర్వహించే సెంటరు కార్యక్రమాల్లో అయిదారు వందలమంది పాల్గొంటే మంచిదే! మరి మీరెంత కృషి చేసినా జనం హాజరు

కాకపోతే నిరుత్సాహపడవద్దు. ఆఖరికి కనీసం అయిదుగురన్నా ఆ సమావేశంలో హాజరైతే, నే నక్కడ వున్నట్లు తెలుసుకోండి. సెంటర్లు నిర్వహించే కార్యకర్తల మధ్య భేదాభిప్రాయాలున్నట్లు నాకు తెలిసింది. అటువంటి లక్షణం పెరిగే కంటే, నా కార్యక్రమం మానివేయుట మంచిది. మీరు నా ఎడల ప్రేమ, నాకు సమర్పణ అగుటలో పోటీపడితే సంతోషిస్తాను. నా కార్యక్రమంలో పోటీపడి మీలో మీరు విడిపోతే, అసలు పునాదులే కదిలిపోతై. "నేను మాత్రమే బాబా కార్యక్రమం చేయగలను" అంటే అంతకంటే పతన మరొకటి లేదు."

"సెంటరు లుండుటలో నా కెట్టి అభ్యంతరంలేదు. అక్కడ బాబా ప్రేమికులు చేరి, నా ప్రేమను పంచుకోవాలి. నా పనిలో ధూళిగా మారాలి. మీ హృదయం, నా ప్రేమతో వెలిగినప్పుడే అది సాధ్యపడుతుంది. మీరు నన్ను ప్రేమించ వలసిన రీతిలో ప్రేమించలేకున్నప్పటికీ, కనీసం నా కొంగు పట్టుకొని వుండుటకు ప్రయత్నించండి. నేను మీకు సహాయ పడెదను."

వృద్ధ ప్రేమికుల గురించి చెపుతూ, యువకులు తమను చిన్నచూపు చూస్తున్నట్లు వూహించుకొని, బాబాతో తమకున్న సాంగత్యాన్ని గుర్తించి, ఎక్కువగా గౌరవించాలని కోరుకుంటారు. నా ప్రేమలో ఎంతగా పెరిగారో అంతగా వారికో ప్రత్యేకత వుండాలన్న తృష్ణ కూడ పెరుగుతుంది. మీలో ఎట్టి తృష్ణలేక నన్ను ప్రేమించాలనేది నా కోరిక. కనుక మీరంతా సోదరులు వలె మెలగండి."

# 3. మెహెర్‌బాబా పిలుపు

( 12-9-'54న అహమ్మద్‌నగర్ సామూహిక దర్శనంలో అందించబడింది)

ధర్మమనేదు వ త్తి కొడిగట్టినపుడు అవతారుడు, మరు క్షణంలోనే వచ్చి, సత్య ప్రేమలనే జ్యోతిని మరల వెలిగించుట యుగ యుగాలుగా జరుగుతున్నదే. ప్రతి యుగంలోను, యుద్ధాలు, భయోత్పాతాలు, అస్తవ్యస్త పరిస్థితులతో ప్రజలమధ్య హాహాకారాలు మిన్నుముట్టినప్పుడు అవతారుడు "అందరూ నా వద్దకు రండు" అని పిలుస్తాడు.

"అయితే, మాయ యొక్క తెర అడ్డు ఉండుటవలన మన కాయన పిలుపు మరుభూమి లోని కేకవలె అగుచున్నది. ఆ పిలుపు విశాల విశ్వంలో అనంతంగా ప్రతిధ్వనిస్తున్నా మొదట్లో ఏ కొద్దిమంది మాత్రమో మేల్కొందురు. క్రమంగా అంతిమంలో లక్షలాదిమంది అజ్ఞాన మనే నిద్రావస్థనుండి మేల్కొని, మానవాళి మధ్య దైవావతరణకు సాక్షీభూతు లగుచున్నారు."

"ఇప్పుడు సమయ మాసన్నమైనది. నేనా పిలుపును మరల పునరావృతము చేసి, "అందరూ నావద్దకు రండ" ని ఆజ్ఞాపిస్తున్నాను. ఈ సారి నా పిలుపు మన్నించి గౌరవించిన వారు పులకితులై, హృదయ ముప్పొంగి పోగలరు."

"నమ్మకాలు, అనుమానాలు ఎవరి కెన్ని ఉన్నా, అనంత ప్రేమరీత్యా అన్నీ భరించి, అవతారుడుగా నేను వస్తూనే ఉన్నాను.

అజ్ఞానంలో కొట్టుమిట్టాడుతున్న, సత్యా సత్యముల తేడా తెలిపి, సహాయ పడుతున్నాను. ”

వినయము, శక్తి నిస్తుంది. అణకువ బలహీనతను చెబుతుంది. నిజంగా గొప్పవాడు మాత్రమే యదార్ధ వినయం కలిగి వుంటాడు.

మానవుడు తనకు సరియైన అవగాహన ఉండి, పరిపూర్ణ జ్ఞానం ఉన్నప్పుడే తనలోని గొప్పదనాన్ని అంగీకరిస్తాడు. అది వినయాన్ని సూచిస్తుంది. నిజంగా గొప్పవాడైనవాడు, నిస్సం దేహంగా తానేదై వున్నాడో అట్టి గొప్పదనాన్ని తగ్గించి చెప్ప టకు అంగీకరించడు.

మరి, తాను గొప్పవాడు కానని తెలిసీ, తన గొప్పదనాన్ని పలికితే అది గొప్పవానిగా నటించుటే కాగలదు. గొప్పవాడు కానివాడు, తాను గొప్పవాడు కానని మనసా వాచా కర్మణా తెలుసు కొనగలిగితే అతడు నీతివంతు డగుచున్నాడు.

తాము గొప్పవారు కానప్పటికీ, గొప్పవారమన్న నమ్మ కంతో ఉన్నవారు చాలామంది ఉన్నారు. వారు మాటలలో, చేతలలో మానవాళికి తాము సేవకులమని తమ వినయాన్ని ప్రకటిస్తారు. యాదార్ధ వినయం అలా చెప్పుకుంటే వచ్చేది కాదు. లేని గొప్పదనం చెప్పుకుంటే గొప్పవారు కాలేరు. యదార్ధ వినయం, యదార్ధ గొప్పదనం ద్వారా ధారావాహికంగా, అవిచ్ఛిన్నంగా రావాలి. లేని గొప్పదనం తెచ్చిపెట్టుకొనేబదులు గొప్పదనం లేదనుకుంటేనే మంచిది.

అణుకువ గురించి జాగ్రత్త పడుడు. వినయమనే ముసుగు క్రింద యీ అణుకువ, మిమ్ములను స్వకీయ వంచనకు దారి తీస్తుంది. అణకువ అహాన్ని పెంచి, గర్వాన్ని అధికం చేస్తుంది. గొప్పదనం, వినయం యీ రెండు యే కృషి లేకుండానే కలసి పోతాయి. అందరికంటే గొప్పవాడు, "నే నందరికంటే గొప్పవాడిని" అని చెప్పినప్పుడు అది అమోఘమైన సత్యం నుండి, ధారావాహికంగా వెలువడ్డ పలుకగుచున్నది. ఆయన సర్వోత్తముడు. ఆయన గొప్పదనం, చచ్చినవారిని బ్రతికించుటలో లేదు. వినయంతో, శిలువ వేయబడుట, అవహాశ్య పడుట, బాధించబడుటకు యిచ్ఛగించుటలోనే ఉన్నది.

"యుగయుగాలుగా, అవతారుని గొప్పదనం సూచించే వినయం యొక్క లోతులను మానవాళి కొలవలేక పోయారు. నిజమైన యోగులు, మునులు సైతం అవతారుని గొప్పతనాన్ని అర్థం చేసుకోలేక పోయారు. ప్రతి యుగంలోను, స్త్రీ పురుషులు తమ అజ్ఞానం వలన దైవ మానవుడు తన దైవత్వాన్ని ప్రకటించినా, అర్ధం చేసుకోలేక తిరస్కరిస్తూ చరిత్రను పునరావృతం చేస్తున్నారు. తిట్టినా, బాధించినా తన అపార దయ వలవ వారి నాయన క్షమిస్తూనే వున్నాడు."

"భగవంతుడు అందరివాడు. ఆయనకు అన్నీ తెలుసును. ఏదైనా చేయగలడు. అవతారుడు తాను సనాతనుడ వని ప్రకటించడ మంటే, భగవంతు డీ పుడమిపై అవతరించినట్లు ప్రకటించడ మన్నమాట. మానవుడు అట్టి అవతార తత్వానికి

వ్యతిరేకంగా మాట్లాడినప్పుడు, అతని ద్వారా భగవంతుడె అలా మాట్లాడినట్లగును.”

నేను నా దైవాధికారంతో చెపుతున్నాను. నీవు నేను మనము కాదు, ఒకరమే. మీరు నా అవతార తత్వాన్ని మీలో ఎరుక లేకుండా తలుస్తున్నారు. నేను ఎరుకతో అనుభవిస్తున్నాను. భగవంతుడు తప్ప వేరేది లేదు. అవిభాజ్యమైన ఆ ఏకత్వంలో మనమంతా వున్నాము. నేను దేముడ్ని, మీరూ దేముడే. మన మంతా ఒక్కటే. పేద, ధనికుల మధ్య తేడా లేదు. భగవంతు నికి, ప్రాపంచిక సంపదకంటె ప్రేమ సంపద ముఖ్యము. ప్రేమ అమూల్య సంపద.

“భగవంతుడు ధనవంతులలో ధనవంతుడూ, పేదరికమే ఆయన. రాజులు సైతం ఈర్ష్యపడునట్లు చేసే పేదరికం. మరి రాజులకు రాజైనవానిని కూడ తన బానిసగా మార్చగలదా పేదరికం. కనుక, పేద ధనికుల మధ్య ఉన్న అంతరం ముఖ్యం కాదని, భగవంతుని కొరకు నిష్కపటంతో పడే తాపత్రయం ముఖ్యమని తెలుసుకొనుడు. అజ్ఞానం నుండి మేల్కొని, అవి భాజ్యమైన ఏకత్వానికి సర్వవ్యాపకత్వమే వున్నది కాని, నీవు నే నను భేదం లేదని తెలిసికొనుడు.”

“అజ్ఞానంలో నివసించకుడు. మీ తోటి వారి మధ్య అంతరాల్ని నిర్ణయించుటలో విలువైన కాలాన్ని వృధా చేయ కుడు. దైవ ప్రేమ కొరకు తాపత్రయ పడుట నేర్చుకొనుడు. మీ ప్రాపంచిక వ్యవహారాలలో సైతం, మీ ప్రియతమునితో

మీ సమత్వాన్ని గ్రహించ కలుగుటకే జీవించండి. అందరూ ఒకటే కనుక, అందరినీ ప్రేమించండి. నిరాడంబరంగా పరిశుద్ధ జీవితం గడపండి. నీతియే మిమ్ములను రక్షిస్తుంది. ఇతరులకు సహాయ పడుటలో సంకోచించకుడు. దైవ ప్రేమ బహుమానం తప్ప మరే బహుమానం కోరకుడు."

"నేను నా దైవ యోగ్యతతో చెబుతున్నాను—మీరు కోరుకొనుదానికంటె అధికంగా నేనిచ్చెదను. దైవప్రేమయొక్క రవ్వ మీ హృదయాంతరాళలో నాటుకొనుటకు నా అనుగ్రహ మందిస్తున్నాను."

## 4. మెహెర్‌బాబా వాంఛితము

మెహెర్‌బాబా ప్రేమికులు ఆయన అభీష్టాన్ని ఎలా యీడేర్చాలో తన వాంఛితాన్ని వివరించారు.

1. నీ బాధ్యతల నుండి నీవు తప్పించుకొనకుము.

2. ప్రాపంచిక సంబంధమైన నీ విద్యుక్త ధర్మాల్ని విశ్వసనీయంగా నిర్వర్తింపుము. కాని అది అంతయు బాబా సేవయే అని అనుక్షణం జ్ఞప్తియం దుంచుకొనుము.

3. నీకు సుఖము కలిగినప్పుడు, "బాబా నన్నానందింప లభిలషించుచున్నా డనుకొనుము. నీవు బాధలలో వున్నప్పుడు బాబా నన్ను బాధ నొంద నభిలషించుచున్నారని భావింపుము.

4. ఎట్టి పరిస్థితి యందైనను నిర్లిప్తతతో నుండి, బాబా నన్ని పరిస్థితిలో నుంచెనని చిత్తశుద్ధితో తలపోయుము.

5. ప్రతియొక్కరి యందును బాబా కలడను భావంతో ఇతరులకు సహాయం చేసి, వారిని సేవింప ప్రయత్నింపుము.

6. ఎవరైనను సరే తమ అవసాన కాలమందు నా యొక్క నామమును స్మరింతురో వారు నన్నే చేరుకొందురని, నా దివ్యాధికారముతో సర్వ జనులకు చెప్పుచున్నాను. కావున మీ తుది ఘడియలలో నన్ను స్మరించుట మరువకుడు. మీ రిప్పటి నుండియే నన్ను జ్ఞప్తి యందుంచుకొనుట ప్రారంభించ నిచో, మృత్యు వాసన్నమైనప్పుడు, నన్ను స్మరించుట దుర్లభ మగును. ఈ క్షణం నుండి, అనుదినము నన్ను స్మరించుట అభ్యసించినచో మీ తుది ఘడియలందు నన్ను స్మరించుట మరువ కుందురు.

## 5. భగవంతుని ప్రేమించుట ఎట్లు?

నిజానికి భగవంతుని ప్రేమించుట అంటే, తోటి మానవు లను ప్రేమించుట. మనం మన సన్నిహితుల విషయంలో ఏ విధంగా మెలుగుతామో, అదేమాదిరిగా, ఇతరుల విషయంలో మెలగ కలిగితే, మనం భగవంతుని ప్రేమించినట్లు.

యితరుల లోని తప్పులను ఎన్నుటకంటే, మనలోని తప్పులను మనము ఎన్నగలిగితే, భగవంతుని ప్రేమించినట్లు.

మన స్వార్థం కొరకు, యితరులను దోచుకొనుటకంటే, యితరులకు సహాయం చేయుటకు, మనలను మనం దోచుకుంటే భగవంతుని ప్రేమించినట్లు.

మనం యితరుల బాధలలో పాలు పంచుకొని, వారికొరకు బాధలు పడి, ఇతరుల సంతోషం చూచి ఆనందపడితే, మనం భగవంతుని ప్రేమించినట్లు.

మనం మన దురదృష్టములపై వ్యథ పడుటకంటే, ఇతరుల కంటే మనమెంతో అదృష్టవంతులమని తలచినప్పుడు భగవంతుని ప్రేమించినట్లు.

ఓర్పుతో, తృప్తితో అది భగవంతుని ఇచ్ఛ అని, మనకున్నదాంతో సంతృప్తి చెందితే భగవంతుని ప్రేమించినట్లు.

భగవంతుని ప్రేమించుట, ధ్యానించుట అంటే, తోటి మానవులకు ఏ విధమైన హాని, బాధ కలుగచేయ కుండుటయే గొప్ప ధ్యానమని తెలుసుకుంటే, భగవంతుని ప్రేమించినట్లు.

## 6. మెహెర్ చైతన్యాన్ని విడువక గుర్తుంచుకోవడం ఎలా?

బాబాయే స్వయంగా యీ విషయంపై ఒకసారి యిలా చెప్పారు.

"విడవకుండా నాయొక్క సమక్షమును గుర్తుంచుకొని నాతో విడువక జీవించుట ఎలాగో నేను మీకు చెప్పెదను—

ఉదయం మీరు నిద్రనుండి లేవగానే ఒక్క క్షణం, కేవలం ఒక్క క్షణం నన్ను జ్ఞప్తికి తెచ్చుకోండి. అలా జ్ఞప్తి వుంచుకొనుట, మీరు చొక్కా తొడుక్కుంటున్నంత తేలికగా వుండాలి. మళ్ళీ మధ్యాహ్నం 12 గంటలకు, సాయంత్రం అయిదు గంటలకు, అనాలోచితంగానే, అంటే అప్రయత్నంగా, ఒక్క క్షణం పాటు, నన్ను జ్ఞప్తికి తెచ్చుకోండి. అలాగే మరల రాత్రి పరుండబోవు నప్పుడు, మరోసారి ఒక్క క్షణం మాత్రమే మళ్ళీ నన్ను జ్ఞాపకం చేసుకోండి. అలా చేసినప్పుడు, మొత్తం రోజుకు కేవలం 4 క్షణాలు మాత్రమే నన్ను స్మరించినవా రగుచున్నారు. ఫలితంగా మెహెర్ చైతన్యాన్ని విడువక గుర్తుంచుకో గలుగుతారు."

"నాకున్న అధికారంతో చెబుతున్నాను. అంతటా సర్వత్రా వ్యాపించి ఉన్న ఆ ఏకైకుడను నే నొక్కడినే. మీ శరీరం వదిలేముందు బాబాను గుర్తుంచుకుంటే, మీరంతా నా చెంతకు చేరుతారు. యీ కోటు, శరీరంతో ఉన్న నేను, నేను కాదు. మీరు తృటిమాత్రంలో చూడకలిగితే, మీరు బంధవిముక్తులైనట్లే. కొన్ని లక్షల్లో ఒక్కడు మాత్రమే అట్టి క్షణిక దృశ్యాన్ని చూడ గలరు. మరి అలాంటి క్షణిక దృశ్యాన్ని చూడ కలిగిన కొన్ని లక్షల మందిలో ఒక్కడు మాత్రమే నన్ను సాక్షాత్కరించుకో గలడు. కొన్ని యుగాల అనంతరం దైవ సాక్షాత్కారం పొందిన ఆ ఒక్కడ్ని మీరు పొందగలరు. నా దైవాధికారంతో మరో సారి చెబుతున్నాను. నా కొంగు మీ చేతుల నుండి జారిపోకుండు నట్లు జాగ్రత్త పడండి."

# 7. ఉనికియే శరీరము - జీవితము - ఛాయ

( రాజమండ్రిలో ది 1-3-54 న మెహెర్‌బాబాచే ప్రవచింపబడినది )

'ఉనికి' శాశ్వతమైనది. జీవించి వుండేది ఉనికి; నశించునది జీవితము. ఒక దానితో ఒకటి పోల్చుకుంటే, మానవుని శరీరము ఉనికి కాగా, ఆ శరీరాన్ని కప్పి వుంచు దుస్తు వంటిది జీవితము. కాల, మాన, పరిస్థితులబట్టి ఒకే శరీరము దుస్తులను మార్చి ఎలా ధరిస్తుందో, అదే మాదిరి, లెక్కలేనన్ని వివిధ జీవిత దశల మధ్య ఎప్పుడూ వుండేది ఏకైక శాశ్వత ఉనికి.

జీవితమనే ముసుగులో, అనేకానేక రంగుల మడతలతో గుర్తించ వీలుకాని విధంగా కప్పబడి వున్నప్పటికీ, ఉనికి మారదు. జీవితమనే దుస్తు, తన మనస్సు, శక్తి, స్థూల రూపాలనే తెరలతో ఉనికిపై, నీడవలె వుంటుంది. శాశ్వతము, అవిభాజ్యము, మార్పు లేనిదైన ఉనికిని, యీ జీవితము, అస్థిరమైన, అనేక రూపాలలో నిరంతరము మారుతున్నట్లు చూపుతుంది.

ఉనికి అంతటా వ్యాపించి వుంటుంది. జీవము-నిర్జీవము, సత్యము-అసత్యము, వివిధ జాతులు-వివిధ రూపాల సారూప్యం, కలసికట్టు, ఏకాంతం, సంగ్రహము-ప్రతిపదార్థ సారము వీటన్నిటి యందు ఉనికి అంతర్నిహితమై వుంటుంది.

ఉనికి యొక్క శాశ్వతత్వంలో కాల నిర్ణయం లేదు. గతం లేదు, భవిష్యత్తు లేదు. నిత్య నిరంతరమైన వర్తమానమే వుంటుంది. శాశ్వతత్వంలో జరిగిందంటూ వుండదు. జరగబోయేది వుండదు. అంతములేని "ఇప్పుడు"లో సర్వమూ జరుగుతూనే వుంటుంది.

ఉనికి భగవంతుడు—జీవితము మాయ.

ఉనికి యదార్థము—జీవితము కేవలం వూహ.

ఉనికి శాశ్వతమైనది—జీవితము అశాశ్వతమైనది.

ఉనికి మార్పులేనిది—జీవితము నిత్యమూ మార్పు చెందేది.

ఉనికి సర్వ స్వతంత్రమైనది—జీవితము మనసు, శక్తి స్థూల రూపములపై ఆధారపడునది.

ఉండేది ఉనికి—ఉన్నట్లు కనపడేది జీవితము.

కనుకనే ఉనికి జీవితము కాదు.

జనన మరణాలనేవి జీవితమునకు ఆద్యంతములు కావు. కాగా జీవితము యొక్క అనేక ఘట్టాల్లో ఏర్పడే జనన మరణాలు, పరిణామము, పునర్జన్మలనే చట్టాల వశములో వుండును. జీవితము, పరిమిత చైతన్యంతో, ఒకే ఒక్కసారి ఉనికి లోనికి వచ్చును. అనంత ఉనికి యొక్క అపరిమిత చైతన్యం పొందగానే ఒకే ఒక్కసారి మరణిస్తుంది.

ఉనికి, సర్వజ్ఞుడు, సర్వశక్తిమయుడు. సర్వమూ వున్న భగవంతుడు. కార్య కారణముల కతీతుడు. కాలానికి, విశ్వానికి అతీతుడు. సకల చర్యలకు అతీతుడు.

ఉనికి సర్వమునూ, అన్ని ఛాయలను, అన్ని వస్తువులను తాకుతుంది. అయితే ఉనికిని ఏదీ తాకలేదు. కనీసం, ఉనికి వున్నదన్న నిజం కూడ దానిని తాకలేదు. ఉనికిని గుర్తించాలంటే, జీవితం రాలిపోవాలి. అపరిమిత ఆత్మకు పరిమితులు కల్పించేది జీవితము. పరిమిత ఆత్మ యొక్క జీవితము, మనసు వలన సృష్టించబడిన సంస్కారాల్ని భరించి, శక్తి వలన ప్రేరణ కలిగి, స్థూల రూపములు ద్వారా శరీరములను పనిముట్లుగా వుపయోగించుకొని, యీ సంస్కారాలన్నిటినీ బలపరుస్తూ, ఖర్చు చేస్తూ తుదకు చేతల ద్వారా ఖర్చైపోవును.

జీవితమనేది చేతలతో గట్టిగా ముడిపడి వుంటుంది. జీవితము, చేతల ద్వారానే జీవిస్తుంది. చేతల ద్వారా జీవితము ఎంతో విలువైనదిగా కనపడుతుంది. జీవితము యొక్క బ్రతుకు తెలుపు చేతల మీదనే ఆధారపడి వుంటుంది. జీవితపు గమనమే చేతలు. చేతలు సహజముగా పరస్పర విరుద్ధములు. అవి అనుకూలము మరియు ప్రతికూలములు. ప్రయోజనకరమైనవి, అప్రయోజనకరమైనవి.

కనుక జీవితమును అంతిమ మరణానికి గురిచేయడమంటే, చేతలను అంతము చేయడమన్నమాట. చేతలు పూర్తిగా

అంతమైనప్పుడు పరిమితాత్మ యొక్క జీవితము తానే పరిమితాత్మ యొక్క ఉనికినన్న అనుభవాన్ని అవిచ్ఛిన్నంగా అనుభవిస్తుంది. ఉనికి గుర్తించబడగానే చైతన్యము యొక్క పరిణామము పూర్తవుతుంది. మాయ అదృశ్యమౌతుంది. పునర్జన్మ చట్టం ఎంతమాత్రం కట్టబడి వుండదు.

కేవలం చేతలు మానినంత మాత్రంచేత వాటికి స్వస్తి చెప్పినట్లు కాబోదు. చేతలు ఆపుట అంటే మందమతి చర్య నాపాదించుకోవడమన్నమాట.

చేతలనుండి తప్పించుకొనుటకు, అట్టి చేతలను సమూలంగా పెరికివేయుట నివారణ కాదు. పైపెచ్చు అలా చేసినందున, పరిమితాత్మను యింకా ఎక్కువగా చిక్కులలో పెట్టు అవకాశం యిస్తుంది. మంచీ-చెడూ అనే చేతలు రెండూ కూడ, జీవితమనే చిక్కుపడిన దారపు ముడులు వంటివి. అలా చిక్కుపడిన ముడులను విడతీయుటకు ఎంతగా ప్రయత్నిస్తే, అంతగా అవి బిగుసుకుపోయి మరింత బంధా లేర్పడును.

విషానికి విషమే విరుగుడైనట్లు చేతలను చేతలే రద్దు చేయాలి. లోతుగా దిగబడిన ముల్లును తీయుటకు, మరో ముల్లు గాని, సూది గాని వుపయోగించి నైపుణ్యంతో జాగ్రత్తగా తీయాలి. అలాగే, చేతలు సమూలంగా పెకలించబడుటకు మరో చర్య అవసరం.

సత్య మార్గంలో, సత్యాన్వేషకునికి, తవ గమ్యమైన శాశ్వత ఉనికిని చేరుటకు, కర్మయోగం, ధ్యానయోగం, రాజ

యోగం, భక్తి యోగాలు వుపయోగపడును. కానీ చేతల వలన జీవితపు పట్టు అన్వేషకునిమీద ఇంకా బిగిసి, పై యోగముల సహాయం వున్నా, సరియగు మార్గంలో అవసరమగు మార్గ దర్శకత్వం పొందలేడు. చేతల వలన ఆత్మ కట్టుబడి వున్నంత కాలం, సత్యపథ అన్వేషకుడు, ఆత్మవంచన ద్వారా దారితప్పి తీరును.

అన్ని యుగాల్లోను, సాధువులు, అన్వేషకులు, ఋషులు, యోగులు, మునులు, తాపసులు, సాధువులు, సన్యాసులు, సూఫీలు, తారిచ్‌లు, వారి వారి జీవితకాలాల్లో ఎన్నెన్నో ప్రయాసలు పడ్డారు. దిక్కుతోచని చేతలనుండి విముక్తులగుట, జీవితము నధిగమించి, శాశ్వత ఉనికిని తెలుసుకొనుటకు చెప్పలేనన్ని బాధలను అనుభవించారు.

వారంతా తమ తమ ప్రయత్నాల్లో కృత కృత్యులు కాలేకపోయారు. ఏలననగా, స్వార్థంతో వారు ఎంత ప్రయాస పడ్డారో అంత గట్టిగా జీవితము వలన స్వార్థము బిగుసుకొని పోయింది. జీవితములో స్వార్థము గట్టిపడటమంటే, అది ఎలా జరుగుతుంది ? కఠినమైన తపస్సులు, క్రతువులు కర్మకాండలు, ఏకాంతవాసము, తీర్థయాత్రలు, ధ్యానము ఏకాగ్రత, ఆదరణ, ఆప్యాయత, మౌన ధ్యానం, అతిగా మాట్లాడుట, జపాలు, తపాలు, అన్నిరకాల యోగాలు యిత్యాదుల చేతల వలన వారి జీవితాలలో స్వార్థం గట్టిగా బలపడి తమ ప్రయత్నంలో అపజయం పాలయినారు.

జీవిత బంధాలనుండి విముక్తి, చేతలయొక్క క్లిష్ట పరిస్థితులనుండి విముక్తి పొందుటకు అందరికీ అవకాశం వున్నప్పటికీ, ఒక సద్గురువుని ఆశ్రయించి, ఆయన కృప పొందిన ఏ కొద్దిమంది మాత్రమో, అట్టి విముక్తిని పొందగలుగు చున్నారు. సద్గురువు తనకు సర్వార్పణ కమ్మనమని సలహా యిస్తాడు. అలా తమ తను, మన, ధన, సర్వస్వం ఎవరైతే సమర్పిస్తారో వారు, అట్టి సర్వార్పణతోపాటు, తమ ఆత్మను కూడ ఎరుకతో గురువుకు సమర్పించుకొందురు. అంతట వారు తమ ఉనికి యొక్క ఎరుకను వదలివేసి, కేవలం గురువు చెప్పిన విధంగా నడుచుకొనుటకే చేతలు చేయుదురు.

తమ ఆత్మను సమర్పించుకున్న తర్వాత, చేయు చేతలు, ఎంత మాత్రం, వారి స్వంత చర్యలు కావు. అందుచేత, ఇట్టి చేతలు, జీవితమును పెంచి పోషించే, అన్ని ఇతర చర్యలను సమూలంగా పెకలించివేయ కలవు. జీవితము అప్పుడు క్రమముగా జీవరహితమై, తుదకు, సద్గురువు కృప వలన అంతిమ మరణం పొందుతుంది. పట్టు విడువని అన్వేషకుడు శాశ్వత ఉనికిని గ్రహించ కలిగి ఒక్కసారి జీవితం తొలగించబడినదంటే, మరి ఎంతమాత్రము అట్టి జీవితం వంచనతో పనిచేయవలసిన అవసరము వుండదు.

నేను యింతకు ముందెన్నోసార్లు చెప్పాను. మీతో ఇప్పుడు చెబుతున్నాను. మీ జీవితమనే ముసుగు తొలగించుకొని శాశ్వతంగా మీదే అయిన ఉనికిని గ్రహించండని ; రానున్న యుగాల్లో కూడా ఘంటాపథంగా మళ్ళీ మళ్ళీ నొక్కి చెప్పెదను.

మార్పులేని, అవిభాజ్యము, సర్వ వ్యాపకమునైన ఉనికి యొక్క సత్యమును తెలుసుకొనుటకు, తేలిక మార్గము, నాకు పూర్తిగా సమర్పణ అగుటయే. అలా మీరు నాకు సమర్పణ అయినట్లు ఏమాత్రం ఎరుకలేకుండా, కేవలం నా యెడల మీకున్న విధేయత మాత్రమే ఎరుక కలిగి వుండాలి. నేను ఆజ్ఞాపించగానే అలాగే నడుచుకోవాలి. నేను చెప్పినట్లు నడుచుకోవాలి.

మీరు శాశ్వతంగా జీవించాలని కోరుకుంటే నాకు మీ సర్వస్వం అర్పించుకొని, అప్పుడు మీ వంచనాత్మకమైన ఆత్మయొక్క మరణాన్ని వాంఛించండి. ఇది అన్ని యోగాల సారం కలబోసిన ఏకైకయోగం.

—మెహెర్ బాబా.

సక్రమమైన జ్ఞానం పొందితేనేకానీ ముక్తిని పొందలేరని శ్రీ ఆది శంకరాచార్యులవారు చెప్పారు. అనేక జన్మలెత్తి, ఎన్నో పవిత్రస్థలాలు దర్శించి, పుణ్యకార్యాలుచేసి, తమ సంపదలన్నీ దానధర్మాలకు వెచ్చించినా అట్టి జ్ఞానాన్ని పొందుట దుర్లభం అన్నారు. మరి ఇట్టి జ్ఞానం సాధన, శిక్షణ వలన పొందేది కాదు. కేవలం సద్గురువు కృప వలననే లభ్యమవుతుంది. గురు కృప కలిగితే దానిని ఎరుకతో అనుభవిస్తాడు.

అన్ని కాలాలలోను ఈపుడమిపై పంచ సద్గురువులుండి, మానవాళిని తమ ఆధ్యాత్మిక గమ్యం వైపు చేరుటకు మార్గ దర్శకులవుతున్నారు. అవతార కాల సమయంలో మాత్రం, అవతారుడు, యీ భూమిపై జీవిస్తూ, అట్టి విజ్ఞానానికి, మూలమైన తన శాశ్వత ఉనికిని, మానవునికి అనేకరీతులలో బోధపరుచును.

ఆధునిక యుగంలో యీనాడు శాస్త్రీయ విజ్ఞానం అధికమైంది. మానవుడు తన విజ్ఞానంతో గ్రహాంతరయానం చేయుచున్నాడు. అయినా సాధించిన జ్ఞానంగానీ, శక్తిగానీ, మానవునికే భూమి మీద అవసరమైన శాంతిని, సుఖాన్ని అందివ్వలేకున్నవి. జ్ఞానం మనలోనే అంతర్నిహితమైవున్నా, మనం దాన్ని గ్రహించ లేకపోవుచున్నాము.

అవతారుడు, మానవరూపంలో రూపొందిన అనంత జ్ఞానం. మానవాళికి తామెవరో, తామేదై వున్నారో తెలియచెప్పుట అవతారుడు చేసే కార్యక్రమం. ఆత్మ పరమాత్మలకున్న సంబంధం, పరిణామ క్రమంలో పునర్జన్మల వలయంలో చిక్కుకున్న జీవుడు, చేతలుడిగి, తన శాశ్వత ఉనికిని గ్రహించి, భగవంతునితో తనకున్న విడదీయరాని బంధాన్ని తెలుసుకొనుటకు బాబా యిచ్చిన పై వుపన్యాసం, సత్యాన్వేషకులు యధార్థజ్ఞానం పొందగలుగుటకు ఉపయోగపడగలదు.

# 8. మెహెర్ మందారం

బాబాను దర్శించుట అంటే, ఆయన ఏర్పాటు చేసిన దర్శన కార్యక్రమాలకు వెళ్ళి చూచి వచ్చుట కానేకాదు. సర్వ కాల సర్వావస్థలయందు, ఆయనను మనసా, వాచా, కర్మణా జ్ఞాపకం వుంచుకోవాలి. ప్రతి పనియందు, ప్రతి మనిషిలోనూ, ప్రతి పదార్థమందు, ప్రతి వస్తువులోను బాబాను చూడకలిగేంతగా ఆయనను ప్రేమించాలి. ఆయనకు కావలసింది మననుండి ప్రేమ మాత్రమే కానీ, మన మెన్నిసార్లు ఆయనను దర్శించా మని కాదు. పళ్ళు, ప్రసాదాలు, వస్తువులు, కానుకలసలే కాదు.

ఒకవేళ మూఢాచార పరాయణులైన ప్రేమికు లెవరైనా, ఏవైనా కానుకలు తీసుకొని బాబా వద్దకు వెళితే "యివన్నీ ఎందుకు తెచ్చారు? నీ ప్రేమ ఒక్కటే నాకు చాలుకదా! అనవసరంగా యివన్నీ తెచ్చి నాకు అధిక భారం పెంచుతున్నారు కదా!" అని అనేవారు. అందుకా ప్రేమికులు "బాబా! నీయందు మాకున్న ప్రేమను తెలుపుకొనుటకు వీటిని నీకు సమ ర్పించు కుంటున్నాము" అని అంటే, "అట్లయినచో నా పేరు చెప్పి అవసరమున్నవారికి వీటిని (పేదవారికి) దానం చేయండి!" అనేవారు,

బాబా తన దివ్యమైన ఆత్మనే దానం చేయుదురు. ఆయ నకు కావలసిన అసలైన కానుక అచంచల మైన ప్రేమ. అంతే

కానీ, మీరు బాబాను ఎన్నిసార్లు చూచారు? ఎన్నిసార్లు ఆలింగన స్పర్శ భాగ్యం పొందారు? అనేవి ముఖ్యం కాదు. బాబాను అసలు భౌతికంగా చూడకపోయినా, ఆయన యెడల అచంచల విశ్వాసముంచి, సర్వకాల సర్వావస్థలయందు బాబాను గురించి ఆలోచిస్తూ ప్రేమించ కలిగితే వారు నిజమైన బాబా ప్రేమికులు.

బాబా చెప్పారు. "నిన్ను నువ్వు ప్రేమించుకుంటే, నన్ను పోగొట్టుకుంటావు. నన్ను ప్రేమిస్తే నేను నీకు కనిపిస్తాను. అన్నిటికంటే నన్ను ఎక్కువగా ప్రేమించు. అప్పుడు నేను అతి సులభంగా నీ మధ్య కనిపిస్తాను. సృష్టిలో జరిగే ప్రతి కార్యమూ, కదలికా, నా అజమాయిషీలోనే జరుగును."

మనము భాబాను ఎంత గాఢంగా ప్రేమిస్తే ఆయన మనకు అంత సమీపంలో వుంటారు. మన బాధల్ని ఆయన బాధలుగా స్వీకరిస్తారు. మనం నవ్వుతూ ఉంటే ఆయన నవ్వుతూ ఉంటారు. మనం దుఃఖిస్తే ఆయన దుఃఖిస్తారు. మనం విచారంలో వుంటే ఆయనా విచారిస్తారు. మనం ఏం చేస్తే ఆయనా అదే చేస్తారు. కనుక మనం బాబాకు భారం కాకుండా వుండాలి. ఆయన నిత్య సంతుష్టులై ఉండులాగున, మనం ఎట్టి కష్టాల్లో వున్నా అదంతా బాబా యిచ్ఛగా భావించి సంతోషంగా ఉండాలి. అందుకే బాబా ఎప్పుడూ చెప్పేవారు, "విచారించకు-సుఖంగా వుండు" అని.

"నన్నేమీ కోరకండి. నన్ను ప్రేమించండి. నేను మీ అవుసరములు చూచుకుంటాను. యుగ యుగాలుగా నేను ఒకే

విషయాన్ని మీకు చెపుతున్నాను. ప్రతిసారీ నేను అదే తరచుగా చెపుతున్నాను—'నన్ను ప్రేమించండి' అని. మీరు నన్నెలా ప్రేమించాలి?

ఒకరు తన స్వంత బిడ్డను చిరిగిన గుడ్డలతో, నడి వీధిలో, నలుగురు మధ్య చూచుట తటస్థపడితే, ఆ తండ్రి ఎంతో బాధపడతాడు. 'అయ్యో! ఎంత చిన్నతనంగా వుంది? నా కుమారుడు నలుగురి మధ్య ఆనందంగా మసలకలగాలంటే మంచి బట్టలు కుట్టించివ్వాలి' అని సంకల్పించి, కష్టపడి సంపాదించి మంచి బట్టలు కొనాలని తపన పడతాడు. అంటే తన స్వంత కుమారుని యందు పుత్ర వాత్సల్యం చూపి, అతనియందున్న ప్రేమను వెల్లడిస్తాడు.

మరి ఇదే తండ్రి, యితరుల బిడ్డలు చిరిగిన బట్టలతో నలుగురి మధ్య కనిపించినా నిర్లిప్తత పాటిస్తాడు. వాత్సల్యమనేది ఏకోశానా కనిపించదు. అనగా "నా కుమారుడు" అనే అహం అడ్డు వచ్చింది. ఇదే స్వార్థం. నేను కోరే ప్రేమ యిది కాదు. నా కుమారుడు, వారి కుమారు డనే భేదభావం చూపక "అంతా ఒక్కటే" అన్న భావంతో యితరుల బిడ్డల యెడల కూడ తనబిడ్డయందు చూపే వాత్సల్యాన్ని చూపకలగాలి. ఇట్టి ప్రేమను నేను వాంఛిస్తాను.

మీరు నన్ను ప్రేమించలేరనిగానీ, నన్నెన్నడు చూడలేరనికానీ, తలపకండి. మీరు నన్ను ప్రేమించండని చెప్పే కారణ మదే! నన్నధికాధికముగా ప్రేమించండి. నన్ను

ప్రేమించవలసినంతగా మీరు ప్రేమించలేరని నాకు తెలుసును. దాని నాచరించుటకు ముందు, నా ప్రేమ బహుమానాన్ని మీరు స్వీకరించాలి. అయితే ఆ బహుమతి నా యిచ్ఛపై ఆధారపడి వుంటుంది. నా యిచ్ఛ లేనిదే ఎవరూ ఆ బహుమాన రూపంలో తప్ప, మరో మార్గంలో యీ ప్రేమను పొందలేరు.

నేను మిమ్మలను ప్రేమిస్తున్నాను. భగవంతుడు మాత్రమే అలా ప్రేమించగలడు. మీరుకూడ నన్ను యింకా ఎక్కువగా, గాఢంగా ప్రేమించండి. నా కొంగు గట్టిగా పట్టు కొని వుండండి. నేను మీకు యివ్వవలసింది పూర్తిగా ముడు తుంది. ధైర్యంగా ఉండండి. కలత చెందకండి. సుఖంగా వుండండి. నేనూ మీరూ అంతా ఒక్కటే।

నేను సర్వోత్తముడను. పురాణ పురుషుడను. కానియెడల సాధువు లనబడే వారిని దర్శించండని మిమ్మలను ప్రోత్సహించి యుందును. భగవంతుడు స్వయంగా మానవుల మధ్య మానవుడై అవతరించి యుండగా, సమకాలికులై ఆయనతో ప్రత్యక్ష సంబంధం కలిగిన అదృష్టం మీకుండగా, భగవంతుని బిడ్డలైన సాధువుల యొద్దకు మీరేల పోయెదరు?

నేను మానవాళి మధ్య వున్నప్పుడు, సర్వసాధారణంగా, మానవులు నన్నర్థం చేసుకొనక ఉపేక్షిస్తున్నారు. నా శరీర త్యాగానంతరం, నన్నర్థం చేసుకొని ఎక్కువగా కొనియాడెదరు. యీమాదిరిగా, నే నవతరించిన ప్రతిసారీ జరుగుతూనే వున్నది. నేను యే సమాజాన్ని కానీ, సంఘాన్ని కానీ, ఏర్పాటు చేయుటకు

రాలేదు. ఏ క్రొత్త మతాన్ని స్థాపించుటకు రాలేదు. అన్ని సమాజాల్ని, సంఘాల్ని, మతాల్ని ప్రజ్వలింపచేసి, ఒకేజాతి క్రిందకు మార్చుటే నేను మీకివ్వదలచిన మతం.

నేను మీ మధ్యకు, మీరంతా నాముందు సాష్టాంగపడి, నాకు హారతి పట్టుటకు, నన్ను శ్లాఘిస్తూ పాడుటకు, లేదా నన్ను పూజించుటకు రాలేదు. యివన్నీ యోగులకు, మునులకు, సాధువుల కవసరం. వీటన్నిటికంటే అధికమైన ప్రేమను మీ నుండి కోరుతున్నాను. నేను మీ స్థితికి దిగివచ్చుటకు కారణం, నా ప్రేమను మీయందు ప్రసరింప చేసి, తద్వారా మీరు, భగవంతుని ప్రేమించి, భగవంతునిగా మారునట్లు చేయుటకే. తక్కిన దంతా మాయ. నానుండి మీరు ప్రేమనుతప్ప మరేది కోరకండి.

నాకు పుష్ప హారాలు సమర్పించుట, సాష్టాంగ పడుట, శ్లాఘిస్తూ భజన కీర్తనలు గానం చేయుట, యీ మూడు ప్రాముఖ్యం లేని సంగతులు. కానీ భగవత్సాక్షాత్కార పథంలో ముఖ్యమైన విషయాలు మూడున్నాయి. అవే ప్రేమ, విధేయత, సమర్పణ. ప్రేమనేది భగవంతుడు మానవునికిచ్చే వరం. విధేయత, సద్గురువు మానవునికిచ్చే బహుమానం. సమర్పణ మానవుడు సద్గురువునకు సమర్పించుకొనే కైంకర్యం. ఎవరైతే ప్రేమిస్తారో వారు ప్రియతమునికి ప్రేమికులు. విధేయుడైన వాడు ప్రియతమునికి ప్రియతముడు. తను మన ధన సర్వస్వాన్ని త్యజించినవాడు ప్రియతమునిలో తానే వుండును.

పూజా పునస్కారాలు కానీ, యజ్ఞయాగాదులుగానీ, ధ్యానము, తపస్సు, ఆరాధనా యివేవీ మానవాళిలో ప్రేమను రగుల్కొల్పలేవు. ప్రేమ కవి యెంతమాత్రం చిహ్నలు కావు. ప్రేమ అనుభవించుటకే గాని, యితరులకు చెప్పేది కాదు. తన ఆరోగ్యం, సంపద, కుటుంబ సంక్షేమం కోరుతూ బాబాను ప్రేమిస్తే, వాటిని సాధించుటకు ప్రేమించినట్లవుతుంది కానీ నన్ను ప్రేమించినట్లు కాబోదు.

కర్మకాండలు క్రొత్త సంస్కారాల్ని తెచ్చిపెడతై. మనసా, వాచా, కర్మణా యీ కర్మలు సంక్రమిస్తాయి. మంచి గానీ, చెడుగానీ, సంక్రమించాక, అనుభవిస్తేగానీ ముక్తి కలుగదు. యీ చక్రబంధం నుండి విముక్తి సాధించాలంటే నిత్య కృత్యాల్ని నిజాయితీతో చేసుకుంటూ, నా నామాన్ని కనీసం రెండు సార్లయినా స్మరించ గలగాలి" అన్నారు బాబా.

ఈ సత్యాన్ని వివరించే ఓ పురాణ గాధను పరిశీలిద్దాం. ఒకప్పుడు నారదమహర్షికి తనను మించిన భగవత్ప్రేమికుడు లేడనే అహంభావం కలిగిందట. నిరంతర నారాయణ జప మాచరించే నారదుని కిట్టి భావం కలుగుటలో ఆశ్చర్యం లేదు. ఎందుకంటే ఆరో భూమిక వరకు మానవుని అహం అంటిపెట్టుకొని ఉంటుందని బాబా చెప్పారుకదా! కాగా జ్ఞాన భూమికలలో పయనించే బాటసారికి, కొన్ని శక్తులు సిద్ధించి, తద్వారా గర్వాధిక్యత పెరిగి, తుదకదే పతనానికి దారి తీస్తుంది. యిట్టి స్థితికి

చేరబోయే నారదునికి పరమాత్మ జ్ఞానోదయం చేయ సంకల్పించాడు.

శ్రీకృష్ణపరమాత్మ నారదుడ్ని పిలిపించి, భూలోకంలో, ఫలానాఊళ్ళో ఉన్న ఫలానా రైతుని కలసి, అతని భక్తిని చూచి రమ్మన్నాడు. మహర్షి భూలోకం చేరి, దైవభక్తుడైన ఆ రైతును చేరి, అతని దినచర్యను జాగ్రత్తగా పరిశీలించాడు. ఉదయాన్నే లేస్తూ రైతు "హే! కృష్ణా! ముకుందా! మురారీ!" అంటూ లేచాడు. పిమ్మట కాలకృత్యాదులు, యింటిపనులు, పొలం పనులు, యిలా తన నిత్య కృత్యాలు పూర్తి చేశాడు. రాత్రి పరుండబోయే ముందు తిరిగి మరొక్కసారి "హే! కృష్ణా!" అని చేతులు జోడించి నిద్రపోయాడు.

ఆజన్మ బ్రహ్మచారి, నిష్టాగరిష్టుడైన నారదునికి, రైతు చర్యలో యే గొప్ప కనిపించలేదు. మర్నాడు పరమాత్మ కదే విన్నవించాడు. అప్పుడు ప్రభువు ఒక గిన్నె నిండా నూనె పోయించి, దానిని నారదునికిచ్చి, నూనె తొణకకుండా నన్ను స్మరిస్తూ, ఆ రైతున్న గ్రామాన్ని ప్రదక్షిణం చేసి రమ్మన్నాడు. నూనె చుక్కకూడ తొణకరాదన్నందున జాగ్రత్తగా ఆ వూరు ప్రదక్షిణం చేసి, నూనెగిన్నెతో శ్రీకృష్ణుని చేరాడు. అంత శ్రీకృష్ణుడు నవ్వుతూ ప్రదక్షిణ సమయంలో నన్నెన్నిసార్లు స్మరించావని ప్రశ్నించాడు.

మునీంద్రుడు వెర్రిమొగం వేసి, "ఇంకా స్మరించే దెక్కడప్రభూ? నూనెచుక్క ఎక్కడ చిందుతుందో నని,

భయపడి చచ్చి, జాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ ప్రదక్షిణం చేశానేగానీ మీ నామాన్ని స్మరించలే" దన్నాడు. అప్పుడు నారాయణుడు "చూచావా! నారదా! సర్వసంగ పరిత్యాగివి, బ్రహ్మ మానస పుత్రుడవు, బ్రహ్మచారివి, నైష్టికుడవు అటువంటి నీవే నా నామాన్ని స్మరించలేకపోతే, ఘోర సంసార వారాశిలో మునిగి సతమతమయ్యే రైతు తన కైనందిన బాధ్యతలు నిర్వహిస్తూ, కనీసం రెండుసార్లయినా, నా నామాన్ని స్మరించకలిగాడంటే ఆతడెంతటి ధన్యుడో ఆలోచించావా? కనుకనే అతడు నా కత్యంత ప్రియుడయ్యాడు" అన్నాడు. అందుచేతనే తన దివ్య నామాన్ని స్మరించుకుంటూ, బాధ్యతల్ని విజాయితీతో పూర్తిచేయమన్నాడు బాబా!

సామాన్య మానవుడు తన కొరకు వ్యధ పడతాడు. గురువు మానవుల కొరకు బాధ పడతాడు. కానీ అవతారుడు మాత్రం ప్రతివారి కొరకు, ప్రతి పదార్థము కొరకు బాధపడును. నీవు భగవంతు డయ్యేంతగా, భగవంతుని ప్రేమింపు డనేది నా సందేశం. నీ మీద దురదృష్టాలు, కష్టనష్టాలు ఎన్ని అవాంతరాలు పెల్లుబికినా అధైర్య పడవద్దు. అవన్నీ భగవంతుని బహుమానాలుగా తలచినచో వాటిని భరించగల ధైర్యాన్ని, శక్తినీ ఆయనే ప్రసాదించును. కష్టాల్ని ఎవరైతే భరించగలరో వారు ఆధ్యాత్మిక మార్గంలో సులభంగా ప్రవేశించగలరు.

# 9. మెహెర్ బాబా పరౌన విశిష్టత

ఈనాడు మన మున్నది కలియుగం. యిది అణుయుగం. రాకెట్ యుగం—స్పుత్నిక్ యుగం. నాగరికత పెరిగిన కొద్దీ సైన్సుకూడ అభివృద్ధి చెందుతోంది. వ్యక్తిగత స్వార్థం ప్రపంచ వ్యాప్తంగా ప్రబలింది. అశాంతి, అస్తవ్యస్త పరిస్థితులు అంతర్జాతీయంగా యుద్ధ వాతావరణాన్ని సృష్టిస్తున్నాయి. ఆధ్యాత్మిక వాతావరణానికి సంకట కాలం దాపురించింది. ఫలితంగా మానవ మేధకు ప్రశాంతి కొరవడింది. మనోవేదన పెరిగి సుఖ శాంతులు అదృశ్యమైనవి.

నిస్సహాయులైన మానవాళి అచేతనంగా రక్షణ కొరకు విలపిస్తుంటే, ఆర్తత్రాణ పరాయణుడైన భగవంతుడు మానవ రూపధారియై అవతరించి, కంపిస్తున్న నాగరికతను, వలిగిపోతున్న మతాన్ని రక్షించవలసిన అవుసరం ఏర్పడింది. ఈ నాటి నవ నాగరికత మానవాళిలో జాతి, మత, కుల, స్త్రీ పురుష వివక్షత లేకుండా, సర్వ మానవ సౌభ్రాతృత్వం, సోదరభావం, సమానత్వం పెంపొంద చేయుటకు శక్తివంతమైన అవతారుని రాక అవసరమైంది.

మన అదృష్టంకొద్దీ యీ ఆధునిక యుగంలో, సనాతనుడైన భగవంతుడు, మానవాళి నుద్ధరించుటకు రక్షకుడై మెహెర్ బాబాగా అవతరించాడు. ఆయన అవతార కాలపరి సమాప్త

మయ్యేంతవరకూ, మౌనంలోనే వుండి, " నేను మేల్కొలుపుటకే గాని, బోధించుటకు రాలేదు " అంటూ, గత అవతారుల వలెకాక తన అద్వితీయ మౌనంతో యీ జగత్తుకు ఆధ్యాత్మిక విమోచనం కలిగించారు.

బాబా ప్రేమిక లోకానికి జూలై 10 బ్రహ్మాండమైన విశిష్టత సంతరించుకున్న రోజు. జీవితంలో అత్యంత విలువైన ఆధ్యాత్మిక సారాన్ని రంగరించి, అన్వేషకుల కందించుటకు 1925 జూలై 10-వ తేదీన మెహెర్‌బాబా అద్వితీయ మౌనాన్ని ప్రారంభించి, 1969 జనవరి 31-వ తేదీన తన పాంచ భౌతిక శరీరం పరిత్యజించే వరకూ నిరాఘాటంగా కొనసాగించారు.

సంవత్సరాలు గడిచినకొద్దీ, విశ్వ వ్యాపకమై, శాశ్వత జ్ఞాపకచిహ్నంగా మిగిలిపోయే యీ మౌన దినపు విశిష్టతను మానవులంతా ఇప్పుడిప్పుడే గుర్తిస్తున్నారు. బాబా ప్రేమికులు ముఖ్యంగా యీ రోజంతా మౌనాన్ని పాటిస్తారు. 9-వ తేదీ అర్ధరాత్రి 12-00 గంటల నుండి 10-వ తేదీ అర్ధరాత్రి 12-00 గంటల వరకు పూర్తి మౌనాన్ని పాటిస్తారు. యీ యుగావతారుడైన మెహెర్‌బాబా సృష్టి కంతటికి తండ్రి. మనకు తెలిసినా తెలియక పోయినా, అందరి హృదయాల్లో నివసించే సర్వ వ్యాపకుడైన ఆ ప్రభువు మౌనం పాటించినట్లు బాహ్యంగా కనిపించినా, మన గమ్యాన్ని చేర్చుటకు తన మౌనాన్ని వినియోగించారు.

ఆధ్యాత్మిక శిక్షణలో మౌనాన్ని సాధన చేయుట అన్ని యుగాల్లోనూ ఆచారంగా వస్తున్నది. "బ్రహ్మజ్ఞానం పొందేందుకు మౌనం ఒక్కటే సరియైన భాష" అన్నారు ఆదిశంకరులు. మొదట్లో ఒక సంవత్సరం పాటు మౌనం పాటిస్తానని ప్రారంభించిన మౌనాన్ని బాబా ఆసాంతం, అవిచ్ఛిన్నంగా కొనసాగించారు. తన మౌనంపై బాబా ఎన్నో వివరణ లిచ్చారు. అవన్నీ మానవ హృదయ ఫలకంపై చెరపలేని ముద్ర వేసుకొన్నవి. చాలామంది జూలై 10-వ తేదీన, పెదవి విప్పి మాట్లాడకుండా పూర్తి మౌనాన్ని పాటిస్తారు.

అయితే నిరంతరం మాట్లాడుట కలవాటు పడిన మన మనస్సును మౌనంగా ఆ ఒక్కరోజు ఉంచుట కొంచం కష్టమైన పనే. అనంత మౌనం నుండి వెలువడే దైవ వాక్కును, హృదయ కవాటం తెరచి వినకలిగేందుకు వీలుగా యీ మౌన విధానం, మనస్సును మౌనంగా వుంచుటకు దోహద పడుతుంది. అలా చేయు కృషిలో సహాయపడేందుకు, బాబా మౌనంతోటే ఎన్నో ప్రకటనలు చేశారు. అవన్నీ ఆయనయందు విధేయత గలవారు ప్రేమికులుగా తయారగుటకు కొంతవరకు సహాయ పడినవి.

మెహెర్‌బాబా యొక్క మౌన విశిష్టతను తెలుసుకొనే ముందు, మౌనముయొక్క ప్రాధాన్యతను గురించి పరిశీలిద్దాము. బాబా మౌనము, దాని విరమణపై మిడిమిడి జ్ఞానంతో చేసిన కొందరి వ్యాఖ్యలు లేకపోలేదు. అయితే అవన్నీ సద్గురువు

యొక్క కార్య విధానంపై సరియైన అవగాహన లేక మాత్రమే. దక్షిణామూర్తి స్తోత్రంలో శంకరాచార్యులు "సద్గురువు-మౌనం" గురించి చక్కగా వివరించారు.

"ఒక పెద్ద వటవృక్షం క్రింద వయోవృద్ధులైన శిష్యులు, యువకుడైన సద్గురువు సమక్షంలో కూర్చొని వున్నారు. గురువు మౌనంతో కూర్చున్నాడు. కాని శిష్యుల సందేహాలన్నీ పటాపంచలై పోయాయి. గురువుగారి మౌనం శిష్యుల సందేహాలన్నీ తీర్చింది. అంటే గురువు తన ప్రవచనాని కుపయోగించిన భాష మౌనం. శిష్యుల మనస్సులలో చెలరేగిన ప్రశ్నలన్నిటికీ గురువుగారి మౌన భాషను వినగల శక్తిద్వారా జవాబులు పొందగలిగారు. మన పురాణాలు, తదితర మత గ్రంథాలు కూడ, యీ సృష్టంతా తమ గమ్యం చేరేందుకు సద్గురువు సహాయపడతాడని చెపుతున్నాయి. అలా పని చేయటానికి మాటలతో పనిలేదు. పైపెచ్చు మాటలు అవరోధా లవుతాయి.

బాబా చెప్పారు. "భగవంతుడు నిరంతరంగా మౌనంలో వుండి పని చేస్తున్నాడు. అయన అనంత మౌనాన్ని తెలుసుకోగలిగిన మహాత్ములు తప్ప, తదితరు లెవ్వరూ ఆ మౌనాన్ని గుర్తించలేరు, వినలేరు కూడ. నా మౌనమే మాట్లాడలేనప్పుడు నోటితో చేసే ప్రసంగాల వలన ఉపయోగ మేముంటుంది?"

అందుకే, కేవలం ఆయన అనంత మౌనాన్ని తెలుసుకోగల ఏ కొద్దిమందో తప్ప ఎవరూ గమనించని, వినని మవునం

పాటిస్తూ, ఆ దైవమే మానవ రూపంలో మెహెర్‌బాబాగా పని చేశాడు. భగవంతుడు అనంత మౌనం కనుకనే, మెహెర్‌బాబా తన అవతార మంత్రాంగాన్ని మౌనంతో ప్రారంభించి, మౌనం తోనే పూర్తి చేశారు. బాబా తన మౌనం గురించి యింకా యిలా చెప్పారు. తా నెవరో, తన కార్యక్రమ విధాన మేమిటో వాటిని గురించి తన మౌనమే చెప్పలేనప్పుడు, నోటితో ప్రసం గించి ఎలా వివరించవచ్చును? మీరు నా మౌనాన్ని వినలే నప్పుడు నా ప్రసంగాల్ని కూడ వినలేరు. ఎందుకంటే దైవ లక్షణం, భాష కూడ మౌనమే!

నిజమైన విషయా లెప్పుడూ మౌనంలోనే ఇవ్వబడతాయి. భగవంతుడు మాత్రమే సత్యం, తక్కినదంతా మిథ్య. దైవత్వం మాత్రమే యదార్థం. అది యిచ్చేందుకే బాబా వచ్చారు. అది మౌనంతోనే యివ్వబడింది. మౌనంగానే స్వీకరించబడింది. ప్రేమాగ్నిలో దైవ ప్రేమికుడు భస్మమైనప్పుడు, ఆ చితాభస్మం నుండి దాసులకు దాసుడైన భగవంతుడు లేచి వస్తాడు.

నా పలుకు నాలకించుటకు, సమస్త ధ్వనుల్ని నా మౌ నంలో ముంచేయండి. నేను మాట్లాడినప్పుడు ఒకే ఒక్క దివ్య పదాన్ని వుచ్చరిస్తాను. అది సత్యాన్ని ప్రత్యక్షీకరించే పలుకు లకు పలుకవుతుంది. ఆ పదాన్ని హృదయం మాత్రమే ఆల కిస్తుంది. అది నీతో వుండి మేల్కొలుపుతుందే కానీ, దానిని మనసుతో వినలేరు. నా మౌన విరమణతో, నా ప్రత్యక్షీకరణ ముడిపడి వున్నదని నేను చెప్పినప్పుడు, నేను విడవకుండా

మాట్లాడుతానని ప్రజ లనుకోరాదు. నేను వుచ్చరించే ఏకైక పదం "నేను భగవంతుడ్ని" అనే స్థితిలో వున్నవారికి మాత్రమే తెలుస్తుంది."

పైన పేర్కొన్న కొన్ని బాబా వివరణలను బట్టి మెహెర్ బాబా యివ్వదలచుకున్న పద మేమిటో మనకు అవగత మవుతుంది. యీ మవునంలో నిగూఢంగా దాగివున్నది ప్రేమ. ప్రేమలో మనస్సుకు ప్రాధాన్యత వుండదు. ప్రేమికుడు ప్రియతముని దివ్యరూప సౌందర్యాన్నే చూస్తాడు. మన జీవిత ధ్యేయం దైవాన్ని ప్రేమించుట. మన జీవిత గమ్యం భగవంతునితో ఐక్యమగుట. అవి చేయటానికి ప్రపంచాన్ని త్యజించవలసిన పనిలేదు. అల్ప కోరికలు, కుటిలత్వం, కపట స్వభావాన్ని త్యజిస్తే, నీ పనులలో ఉంటూ, నీవు భగవంతుని ప్రేమించు రీతిలో ప్రేమించ గలవు.

బాబా! మీరు ఎందుకు మాట్లాడరు అని మీరు ప్రశ్నిస్తే, నేను మూడు కారణాలు చెపుతాను.

1. మీ అందరి ద్వారా నేను నిత్యం మాట్లాడుతూనే ఉన్నాను.
2. మీ అందరి ద్వారా అమాయకంగా మాట్లాడుతూ విసుగు పుట్టకుండా యీ నా వ్యక్తిగత భౌతిక రూపంలో మవునంతో వున్నాను.
3. ఉపన్యాసాలు, సందేశాలు, ప్రకటనలు, ప్రవచనాలు మున్నగునవన్నీ మాటలలో చెప్పినా, రాతలలో వెలువరించినా అవన్నీ వ్యర్థమే కనుక మవునంతో ఉన్నాను.

తన మవున విరమణ ఎప్పుడు చేస్తారని అడిగితే "ఆరంభం కాని ఆరంభంలో పలికిన నిజమైన పలుకును పలుక వలసిన సమయం రాగానే పలికెదనని, నా బాహ్య మవునం విరమించే సమయం సమీపించిందని" చెప్పారు.

తమకోసం, తమవారి భవిష్యత్తు తీర్చి దిద్దుకోవటం కోసరం ప్రతివారు కృషి చేస్తారు. తమ స్వార్థాన్ని విస్తరించుకొనుటకొరకు ప్రయాస పడతారు. బహుకొద్దిమంది మాత్రం శాశ్వత సుఖం కొరకు పోరాడుతారు. శాశ్వత సుఖం సాధించుటకు ప్రధాన సాధనం ప్రేమ. ప్రేమకు మాటలతో పనిలేదు. వప్పందాలకు స్థానంలేదు. అది వుంటే పూర్తిగా వుండాలి. లేదా! అసలు లేకుండా వుండాలి. ఒక యువకుడు గాఢంగా ఒకమ్మాయిని ప్రేమించాడనుకోండి. అతని ఆలోచనలన్నీ ఆమెపైనే ముసురుకుంటాయి. నిద్రా హారాలు మానేస్తాడు. చెలి సాంగత్యం కొరకు తపిస్తాడు. వారిరువురు కలిసినప్పుడు, కను సైగలతోనే ప్రేమను ప్రకటించుకుంటారు. వారి కప్పుడు మాటలతో పనిలేదు. అలాగే ప్రేమికుడు మరో ఆలోచనకు తావీయక ప్రియతమునిపైనే లగ్నం చేయాలి.

లైలా మజ్నూల ప్రేమను చూడండి. మజ్నూ అంతగా లైలాను ప్రేమించాడు. అన్నిటా తనచుట్టూ వున్న ప్రతివారిలోను ఆమెనే చూచాడు.

మెహెర్‌బాబా ప్రేమికులలో లక్ష కొక్కరన్నా అంతటి ప్రేమను పొంది యుండవచ్చును. ఇక్కడ మవునం సాన్ని

హిత్యాన్ని సూచిస్తోంది. సమైక్యానికి దోహద పడుతోంది. ఇరువురు చేరువ కావటానికి సహాయ పడింది.

ఇద్దరిమధ్య స్పర్థ లేర్పడినప్పుడు, ఒకరిని చూచి మరొకరు కోపగించుకొని కేక లేసుకుంటారు. ఫలితంగా విరోధం ప్రబలి విడిపోతారు. ఎదురెదురుగా వుండి, మాట్లాడుకుంటున్నా బిగ్గరగా అరుస్తారు. ఎందువలన? మాటలు ద్వేషాన్ని పెంచుతాయి. ఇరువురి మధ్య అఘాతం ఏర్పడుతుంది. చూచారా? మవునం ప్రేమకు చిహ్నంగా యిరువురి కలయికకు కారణమైతే మాటలు, యిరువురి మధ్య ద్వేషాన్ని పెంచి, విడిపోవుటకు దోహద పడినయి. అందుకే ప్రియతముడైన మెహెర్‌బాబా "నా యీ ప్రస్తుత అవతార రూపం, యీ యుగంలో చిట్టచివరి జన్మ. కనుక నా ప్రత్యక్షీకరణ ఎంతో ఘనంగా వుంటుంది. నా మవునాన్ని విడనాడినప్పుడు నా ప్రేమయొక్క ప్రభావం విశ్వాత్మకమై సృష్టిలోని సకల జీవులు దానిని తెలుసుకొని అనుభవించగలరు" అని చెప్పారు.

"నా మవున విరమణ—అది నాయొక్క బహిరంగ, ప్రత్యక్ష సాక్షాత్కారానికి సూచన. మీకది ఎంతో దూరములో లేదు. అతి గొప్ప ధన సంపదను, మానవులంతా పొందుటకు తెచ్చాను. ఇది నిధులకు నిధి. శాశ్వతంగా వుంటుంది. ఎన్నటికీ తరగదు. ఎందరెంత పంచుకున్నా యింకా పెరుగుతుంది. కనుక అట్టి నిధిని పొందుటకు మీరంతా సిద్ధంగా వుండం" డన్నారు.

మౌనము పాటించిన మొదట్లో తన సాధారణ కార్యక్రమా లన్నీ యధావిధిగా కొనసాగించారు. ఆ రోజులలో తన సందే శాల్ని పలకపై వ్రాసి చూపేవారు. దాదాపు ఒక సంవత్సరం పాటు రోజూ గంటలతరబడి చీకట్లో కొయ్య భోషాణంలో కూర్చొని, యింతవరకు ప్రచురించక అతి రహస్యంగా వుంచ బడిన "ది బుక్" అనే గ్రంథాన్ని వ్రాశారు. బాబా స్వయంగా వ్రాసిన యీ వ్రాతప్రతి యొక్క వివరాలు ఎవరికీ తెలియదు. పుస్తకం వ్రాయుట పూర్తి కాగానే, ఒక పెట్టెలో పెట్టి, తాళం వేసి భద్రపరచి, మండలి ఎవరూ చూడవద్దని ఆదేశించారు. సందర్భం వచ్చినప్పుడల్లా బాబా దానిని తన బైబిలు అనేవారు. అందులో, యింతకు మునుపెన్నడూ తెలియపరచని, ఎవరికీ తెలియని రహస్యా లెన్నో వున్నాయని, అత్యంత చైతన్యాతీత స్థితిలో, తన స్వకీయానుభవముల కథ, మరియు శాస్త్రీయపర మైన అనేక నూతనవిషయా లెన్నో దాగి వున్నాయని బాబా చెప్పేవారు. సరియగు సమయం వచ్చినప్పుడు ఆ పుస్తక ప్రచురణ జరుగుతుందన్నారు.

1927 జనవరి 2-వ తేదీన బాబా తన చేవ్రాలు చేయుట తప్ప వ్రాయుట మానేశారు. అప్పటి నుండి ఇంగ్లీషు అక్షర ఫలకం ఉపయోగించుట మొదలుపెట్టారు. ఆయన తన వ్రేలితో ఆ అక్షర ఫలకంపై, ఎంతో నైపుణ్యంతో కదిలిస్తుంటే, ఆయన శిష్యులు కొందరు ఏకసంధాగ్రాహులై ఆయన సూచనలను కడు నేర్పుతో గ్రహించేవారు. 1954 లో చివరి కీ బోర్డును కూడ

త్యజించారు. చేతి సౌంజ్ఞలతో సందేశాలి స్తే, శిష్యులు నేర్పుతో వాటి సారాన్ని గ్రహించేవారు.

ముఖ్యంగా బాబా తానివ్వదల్చుకున్న దానిని పదముల ద్వారా కాక, పరిపూర్ణమగు సమర్పణ యొక్క మౌనం ద్వారా, నిశ్శబ్దమగు ప్రేమను హృదయాంతరాళాలలోనికి ప్రవహింప చేస్తా నన్నారు. మీ మనస్సులకు వ్యాయామం కల్పించే మాట లతో మిమ్మల్ని విసిగించుట నాకిష్టం లేదు. మీ మనస్సులు నిద్రావస్థలో వుండుటే నా యిచ్ఛ. అప్పుడే నా ప్రేమ మీ హృదయంలో మేల్కొంటుంది. ఈ యుగంలో పదములు విపరీతంగా వృద్ధి చెంది, వాటికి అర్థమే లేకుండా పోయాయి. మునుపటి నా సందేశాలన్నీ నిర్లక్ష్యం చేయబడి, వాటికి విపరీతా ర్థాలు కల్పించ బడినవి. అందుకే నేను మౌనం వహించితిని. నే నీ ప్రపంచమునకు ఇరుసువంటి వాడిని. ఈ జగత్తు భారాన్ని మోస్తున్న వత్తిడిలో నా మౌనం నుండి ఆ పదం తొప్పుకొనును. నా అంతట నేను మౌనం విరమించను. ఇదే నా మహనీయత. కనుక నా సంకల్పానికి కట్టుబడి, ఎట్టి పరిస్థితులలోను, నా కొంగు వదలవద్దు."

జీవితంలో నిరంతరం ప్రయాస పడుతూ, అపజయం పాలై, నిరాశ, నిస్పృహ చెంది, సంకోచంతో సతమత మవు తున్న మానవాళికి నేను చెప్పేది ఒక్కటే. "విశ్వాసం కలిగి వుండండి". • దైవానికి సర్వార్పణ గావించుకొని, దివ్వ

ప్రేమను పొందండి. కుశంకలతో నా మౌనం గురించి చర్చించ కండి. నన్నర్థం చేసుకొనుటకు ప్రయత్నించకండి. నా లోతును మీకు కొలువ శక్యం కాదు." అన్నిటికంటే అధికంగా ఆయ నను ప్రేమించ కలిగినపుడు తానే భగవంతుడు కాగలడు.

## 10. దైవ ప్రేమ

ప్రేమంటే ఏమిటి? అది యిచ్చేదేకానీ, ఎన్నడూ అడుగనిది ప్రేమ. అట్టి ప్రేమను చేర్చేది దైవ కృప. మరి ఆ కృపను చేర్చేదేమిటి? కృప చౌకగా బజారులో దొరికేది కాదు. అది ఎల్లప్పుడూ యితరులకు సేవ చేయుటకు సిద్ధంగా వుండి, ఇతరులనుండి ఎట్టి సేవ కోరనప్పుడే దొరుకుతుంది. యింకా యీ కృపను పొందాలంటే అనేక మార్గా లున్నాయి.

1. తన స్వార్థం వదులుకొని, యితరుల సంక్షేమం కోరాలి.
2. ఎన్నడూ ఇతరులను నిందించరాదు.
3. ఓర్పు, సహనం కలిగి వుండాలి.
4. వ్యథ పడకుండుటకు ప్రయత్నించాలి.
5. ఇతరులలోని మంచిని గ్రహించి, చెడును గురించి తక్కు వగా యోచించాలి.

ఇంతకంటే కృపను చేర్చే దేమున్నది? పైవన్నీ ఆచ రించండి. "నీ పొరుగు వానిని ప్రేమించుడు" అని క్రీస్తు

చెప్పినప్పుడు దాని అర్థం నీ పొరుగువాని ప్రేమలో పడమనికాదు. పైవానిలో ఏదో ఒకటి పరిపూర్ణంగా ఆచరించకలిగి, తక్కినవన్నీ అనుసరించ కలిగితే కృప దానంతటదే ప్రత్యక్షమౌతుంది

ప్రేమనేది ఊహించుకున్నంత మాత్రం చేత పుట్టదు. తన కోరికను, మనసా వాచా కర్మణా వినియోగించి అనుభవ పూర్వకంగా కృషి చేస్తేనే కాని పుట్టదు. యీ ప్రేమనేది, అంతరంగం నుండి అవిచ్ఛిన్నంగా కంపించాలి. అది యేవిధమైన ప్రేరణ ద్వారా జనించదు. ప్రేమా, ప్రేమ వాంఛ, ఈ రెండూ సమాంతరములుగా పయనించవు. ప్రేమ ఎవరిమీద బలవంతంగా రుద్దబడదు. ప్రేమ ప్రేమచేతనే మేల్కొల్పబడుతుంది. యధార్ధ ప్రేమ జయించలేనిది—ఇముడ్చుకోలేనిది.

నీవు ప్రేమించావంటే, అది నీ విచ్చినట్లు. మరి నీవు ప్రేమలో పడినప్పుడు దాని నాశించినట్లవుతుంది. నన్ను మీ యిష్టంవచ్చినట్లు ప్రేమించండి. నేను ప్రేమ స్వచ్ఛతకు మూలాన్ని కావున నన్ను ప్రేమించండి. మీ బలహీనతలన్నిటినీ నా ప్రేమాగ్నిలో దహించగలను. మీ తప్పులు, బలహీనతలు, దుష్టతలంపులన్నీ నాకు సమర్పించండి. కేవలం యిచ్చివేయండి. ఒకవేళ మీలో ఎవరైనా నా ప్రేమలో పడితే నే నట్టివారిని పరిశుద్ధ పరచగలను. కానీ మీ రెవరితోనైనా ప్రేమలో పడితే అది "ప్రేమ" అని పిలువబడదు.

ప్రేమ భగవంతునంతటి స్వచ్ఛమైనది. అది యిస్తుందే కానీ దేనినీ అడుగదు. అందుకు నాకృప కావాలి. హిమాలయాల్లోని, యోగులు పెద్దపెద్ద గడ్డాలు, మీసాలు, పెంచుకొని, ధ్యాననిమగ్నులై యోగసమాధిలో కూర్చున్నా, వారీ ప్రేమను పొందలేకపోయారు. అది అంతటి దుర్లభమైనది.

తల్లి తన బిడ్డ కొరకు మరణిస్తుంది. ఇది అత్యున్నతమైన త్యాగం, ఐనా ఇది ప్రేమకాదు. యోధులు తమ దేశం కొరకు త్యాగం చేసి వీర మరణం పొందుతారు. కానీ యిది ప్రేమకు సమం కాదు. ప్రేమంటే—నీలో ప్రేమ జనించినప్పుడే నీవు దానిని గ్రహించగలవు. వ్యావహారికంగా తెలుసుకోలేవు. అనుభవపూర్వకంగా మాత్రమే తెలుసుకోగలవు. ప్రేయసీ ప్రియుల మధ్య ఉండే ప్రేమ స్వార్థపూరితమైనది. ఎట్టి స్వార్థ చింతన లేని నిష్కామ ప్రేమ, ప్రతిక్షణం అవిచ్ఛిన్నంగా వుండాలంటే దైవ కృప అవసరం. అయితే మీరు చేసే ప్రయత్నం అట్టి కృపను చేరుస్తుంది. భగవంతుడంటేనే ప్రేమ. అనంతమగు ప్రేమే—దైవం.

కామం వేరు—ప్రేమ వేరు. కామంలో ఒక రూపము యొక్క భావంపై గురి వుంటుంది. ఆధ్యాత్మిక భావానికి అవగాహన ఉండదు. ప్రేమలో ఆ రూపముయొక్క వెనుక వున్న యథార్థతతో సరాసరి బంధం ఏర్పడుతుంది. కనుకనే కామం కడు భారంగానూ, ప్రేమ తేలికగానూ వున్నట్లనిపిస్తుంది. కామం జీవితాన్ని క్షీణింపచేస్తే, ప్రేమ అభివృద్ధి పరుస్తుంది. కామంలో

జీవిత పతనానికి అవకాశమున్నది. ఇందులో ఎడబాటు, బాధ అనే ఆవేదనలున్నాయి. కానీ ప్రేమలో సమైక్యం, సంతోషమూ అనే భావాలున్నాయి. కామం దుఃఖానికి హేతువైతే, ప్రేమ సంతోషదాయకం.

కామం కోరికలకు కారణమైతే, ప్రేమ ఉత్తేజానికి మార్గం. కామం తృప్తిని కోరుతుంది. ప్రేమ తృప్తిని అనుభవిస్తుంది. కామంలో అలసట ఉంది. కానీ ప్రేమలో పరిపూర్ణ సంతృప్తి వుంది. అయితే కామ వాంఛలు తొలగించుకొనుట కెంతో ధైర్య సాహసాలు కావాలి. వాంఛలు ఎప్పటికీ, చివరికి సన్యాస జీవితంలో కూడ వదలవు ఎందుచేత? అవి పరిణామ క్రమంలో జన్మ పరంపరగా సంతరించి తెచ్చుకొన్న వారసత్వం. కడిగి కడిగి, నిర్మలం చేయాలి. అది నెలలోనో సంవత్సరం లోనో లేదా నీ జీవిత కాలంలోనో జరిగేది కాదు.

నిరంతర జీవిత సమరంలో, నీ కోట సంరక్షణార్థం సంగ్రామం చేస్తూనే వుంటావు. అయినా కామ వాంఛలకు దూరం కాలేవు. కామవాంఛలకు లోనగుటచేత "సత్యం" తో ఎడబాటు అవుతున్నావు. శృంగారపు కామవాంఛలు తొలిగిపోయి, పశు వాంఛలు విడనాడితేనే కానీ దైవప్రేమ పొందలేరు.

అందుకే బాబా. "అట్టి దైవప్రేమ పొందాలంటే, నీవు నిజంగా ఆ సత్యాన్ని పొందగలగాలంటే పూర్తిగా బ్రహ్మచర్య మన్నా పాటించు. లేదా వివాహమాడి, పోషించకలిగితే పిల్లల్ని

కను. నీలోని కామవాంఛలు పెల్లుబికినప్పుడు తగిన భాగస్వామిని ఎంచుకొని వివాహమాడి, ఆమెతోనే కట్టుబడి వుండి, పిల్లా జెల్లాతో సుఖించు" అంటారు. ఇక్కడ ఒకే భాగస్వామితో కట్టుబడి వున్నందున, తదితర క్రొత్త భావాలు ప్రకోపించవు. యిరువురి మధ్య కామ కోరికలు సమంగా నిలిచి వుంటవి.

'ప్రేమ' కు బాబా ప్రాముఖ్యాన్నిచ్చారు. దైవప్రేమ ద్వారా మాత్రమే ఆత్మ సాక్షాత్కారాని కవకాశ ముంటుందని బాబా వివరించారు. భగవంతుని తెలుసుకొనుటలో భౌతిక ప్రేమ వినియోగ పడుతుంది. శారీరక వాంఛలు తీర్చుకొనుటకు ఏర్పడిన భౌతిక ప్రేమ ద్వారా నిస్వార్థ ప్రేమను సాధించాలి. భక్తి పరాకాష్టకు చేరినప్పుడు అసలైన ప్రేమ వ్యక్తమవుతుంది.

భౌతిక ప్రేమలో ఎన్నోరకా లున్నాయి. మృగరాజు ఆకలిగొన్నప్పుడు మదించిన గజరాజును ప్రేమిస్తుంది. దానిని ఎలా తినగలనన్నదే సింహపు నిరంతరాలోచన. ఇది అతి నికృష్టప్రేమ. మానవజాతిలో యీ పశుప్రవృత్తి తారస్థాయికి చేరింది. ఆకలి వేసినప్పుడు పట్టెడు మెతుకులు చూస్తే ప్రేమ పుట్టుకొస్తుంది. అందమైన అమ్మాయిని చూచి మోహిస్తే, ఆమెను పొంది, తన కామవాంఛలు తీర్చుకొనుటకే ప్రేమను వినియోగిస్తున్నాడు. కీర్తి, కాంతాకనకాలు కాంక్షించే మానవుడు పేరాశ రూపంలో ప్రేమను ఆరాధిస్తున్నాడు. సంసారసాగరంలో కొట్టుమిట్టాడుతూ, కేవలం పొట్టకూటికి ధనార్జన చేయ పూను కున్న మానవుడు తృప్తి తీరక, అవిశ్రాంతంగా పరిశ్రమిస్తాడు.

ఇక్కడ సంపాదనే అతని ప్రేమారాధన. క్షుద్రమైన ధన సంపాదనకు పరిమితమైన ప్రేమ అశాశ్వతము. ఈవిధమైన భౌతికప్రేమ నారాధించేవారు దైవాన్ని ప్రేమించలేరు.

ఒకసారి బాబా బజారునుండి కొన్ని చాక్లెట్లు తెప్పించి, అందులో కొన్ని, దగ్గరున్న మండలివారందరికీ పంచి, తిన మన్నారు. కొంతసేపైన తర్వాత, "తిన్న చాక్లెట్లు రుచిగా వున్నాయా?" అని అడిగారు. ఒక్క అర్జున్ తప్ప తక్కిన వారంతా చాల రుచిగా ఉన్నాయన్నారు. మరో ఐదు నిమిషా లనంతరం, ఇందాకటి చాక్లెట్ల రుచి యింకా అనుభవిస్తున్నారా? అని అడిగారు. తియ్యగా వున్న జ్ఞాపకం వుందికానీ, నోరు తియ్యగా లేదన్నారు.

మనస్సుకు ఒక మంచివస్తు వేదైనా యిచ్చినప్పుడు అది సంతృప్తి పడుతుంది. కానీ కొద్దిసేపట్లోనే తన సహజ స్థితికి చేరుకుంటుంది. చేదుమందుకానీ, విరోచనకారులైన ఆముదము వంటివి బలవంతంగా యిచ్చినప్పుడు మనస్సు వ్యతిరేకిస్తుంది. అయిష్టత చూపుతుంది. కానీ కొద్దిసేపట్లో మళ్ళీ మామూలు స్థితికి వస్తుంది. దీనినిబట్టి, బాధలు, ఆనందం రెండూ యీ ప్రపంచంలో క్షణభంగురాలని, అశాశ్వతమని రుజువవుతోంది.

యింతకుముందు మీరు ఎంతో మక్కువతో చాక్లెట్లు ఆనందంగా తిన్నారు. కానీ కొద్దిసేపట్లోనే ఆనందం నశించి, మళ్ళీ పూర్వ స్థితికి చేరి, రుచి కలిగిన జ్ఞాపకం గతించిన జ్ఞానమైంది. దానిఫలితం ఏదీ మిగలలేదు. అత్యున్నత ఆనందాన్ని ఈ ప్రపంచంలో కలిగించేది స్త్రీతో సంధానం. మరి యిదిమటుకు ఎంతకాలం నిలిచి వుంటుంది? కేవలం కొన్ని క్షణాలు మాత్రమేగదా! కనుక భౌతిక పర సుఖా లన్నిటిలో వుండే ప్రేమ నిజమైన ప్రేమకాదు.

# 11. నవ మానవాళి

(మెహెర్‌బాబా ఇచ్చిన సందేశ సారం)

ఈనాటి యువకులు రేపటి పాలకులు. వస్తువులన్నీ ఆరంభంలో చిన్నవే. చిన్న విత్తనం మహావృక్ష మౌతోంది. జలమేరు మహానదవుతోంది. చంటిబిడ్డ మనిషవుతున్నాడు. ఇతడు యువకుడుగా వున్నప్పుడు మంచీ చెడులను జీర్ణించుకొని, పెద్దయిం తర్వాత వాటినిబట్టే మారతాడు. ఆధ్యాత్మిక దృష్టిలో పెద్దయినా, పిల్లవాడితో సమానమే.

పెరుగుదల క్రమ ప్రకారం జరుగుతుంది. అలాగే మానవుడు క్రమంగా, అంచెలంచలుగా యదార్థ పెరుగుదల ప్రారంభించి, యీర్ష్య ద్వేషాల కతీతుడై, నిస్వార్థ సేవ ద్వారా ప్రేమను సాధించకలడు. ఇందు కెంతో ధైర్య సాహసాలు, ఏకాగ్రత లవసరం. బడిలో చదువులు చెప్పేందు కనేక మంది ఉపాధ్యాయు లున్నట్లే, ఆధ్యాత్మిక మార్గంలో గమ్యం చేర్చే మార్గం చూపగల గురువు లెందరో వున్నారు. మరి అట్టి గురువును పొందగల భాగ్యశాలురు బహు కొద్దిమందే వుంటారు. మీరలాంటి గురువును పొందకలిగినప్పుడు, ఆయన కృపను మీరు సాధించాలి. ఆయన ప్రేమకు పాత్రులు కావాలి.

ఈ నాడు మానవాళి, గతకాలపు క్లిష్ట పరిస్థితుల మాదిరి గానే, ఆధ్యాత్మిక పునరుజ్జీవనం పొందేందుకు భరించరాని

కష్టాల్ని ఎదుర్కొంటున్నారు. వినాశకర శక్తులు రగిలించేందుకు కాచుకొని వున్నాయి అయితే మానవాళి నుద్ధరించేందుకు, కొన్ని అనుకూల శక్తులు కూడ అనేక మార్గాల ద్వారా విడుద లగుతున్నాయి. ఇదంతా దైవ నిర్ణయంలో ఒక భాగం. అలసిన వారికి క్రొత్త ఊపిరి పోయుట కివి దోహదపడతై.

ప్రస్తుతం అన్ని జీవిత రంగాల్లోను, మానవాళి ఎదుర్కొం టున్న పోటీ, పగ, పోరాటం మున్నగువాటి నుండి విముక్తి పొందుట కనువగు మార్గా అన్వేషించుట తక్షణ సమస్య. వినాశ కర, అస్తవ్యస్త పరిస్థితులలో కొట్టవచ్చినట్లు కనపడేది యుద్ధ వాతావరణం. అయితే యీ యుద్ధాలు మానవాళి కొక ముఖ్య సమస్య కాదొచ్చు. కానీ బాహ్యంగా ఇవి ఉపేక్షించరానివిగా వుంటవి. యుద్ధాలవల్ల వచ్చే చెడు, బాధలు గురించి ప్రచారం చేసినంతమాత్రంచేత అవి తొలగిపోవు. మానవ చరిత్ర నుండి అవి అదృశ్యం కావాలంటే, వాటి మూల కారణాన్ని ఛేదించు టవసరం.

వ్యక్తులమధ్య ఆర్థిక, సామాజిక పరమైన ముఠా తగా దాలు ప్రబలి, చిలికి చిలికి గాలివానైనట్లు, కక్షలు కార్పణ్యాలు పెరిగి, చివరి కది తార్కికంగా, యుద్ధ వాతావరణానికి దారి తీస్తు న్నాయి. యుద్ధాల్ని ప్రోత్సహించే అవ్యక్త స్థితికి మూల కారణం చాలా మందిలో వుండే మూర్ఖత్వంతో కూడిన అహం కారం. ఈ ప్రపంచమంతా ప్రస్తుతం అనాగరిక స్థితికి దిగ జారుతోంది. గీతలో కృష్ణుడు "నీవు కూడ దేముడవు

కావచ్చును. నీవు నన్ను ప్రేమిస్తే నన్నానుసరించు. మరో మార్గం లేదు" అన్నాడు. నీ మనస్సు నీపై ఎన్నో ఒత్తులు చేస్తుంది. మనస్సెంతచేసినా పరవాలేదు ఏ కోరికలైనా, ఏ భయాలైనా రానీ, నీవు నా ఆదేశాలు ఆచరించిన ఫలితంగా నీవు నా కొంగు పట్టుకోగలవు.

"నీ కెవరితో పరిచయమైనా, నీ వెవరిని కలిసినా, అంతా నాయిచ్ఛ వలననే యని ఎరుగుము. నేను చెప్పినట్లు నడుచు కొనుటే నీ ధర్మం. యుద్ధంలో సేనకు తగు సూచనలను సేనా నాయకుడిస్తే విధిగా పాటించి తీరాలి. ఎట్టి పరిస్థితులలోను తమ స్థానాన్ని విడనాడరాదు. అలాగే నా సందేశాలు మీరు విధేయతతో పాటిస్తే సత్యముయొక్క అనంతతత్వాన్ని అనుభ వించ గలరు."

శ్రీకృష్ణుడు కురుక్షేత్ర మహాసంగ్రామం తెచ్చి వుండక పోతే గీత బోధించి ఉండేవాడు కాదు. ఎందుకంటే, అంతా పోరాడాలనే తలంపుతో వున్నారు కనుక అలా జరిగింది. "పోరాడవద్దని చెప్పుతుంటే, ఆయన మాట ఎవరూ విని వుండే వారు కాదు. పోరాడమని చెప్పుటలో, సత్యముయొక్క అస లర్థాన్ని ప్రపంచంలో ఎరుకపర్చాడు. కృష్ణ డర్జునునికి గీత నుపదేశించి, చంపువాడు తాను కాదన్న పరిపూర్ణ జ్ఞాన మందిం చాడు. అప్పుడే అర్జునుడు బంధాలన్నీ వదులుకున్నాడు. అనాసక్తు డైనాడు. చంపాలనే తృష్ణ లేకున్నా, వారి ఆధ్యాత్మిక మంచి

ఆధ్యాత్మికానుభవాలు తెలివితేటల వల్ల పుట్టవు. గ్రహణ శక్తి ఆధ్యాత్మికానుభవం తెలియచేయుటకు సహాయ పడుతుంది.

ఉదాహరణకు చూడండి! ఇరువురు వ్యక్తులకు తల నొప్పి వచ్చిందనుకోండి. వారిరువురు కలసి తమకు వచ్చిన తలనొప్పి గురించి పరస్పరం చెప్పుకొని వివరించుకోగలరు. తమకున్న తెలివితేటల ద్వారా తమ బాధను అవగాహన చేసుకో గలరు. అయితే అందులో ఒకరికి ఎప్పుడు తలనొప్పి రాలే దనుకోండి, అప్పు డాతనికి తెలివి నుపయోగించి, తలనొప్పి గురించి ఎంత చెప్పినా అర్థంకాదు. నిజంగా తల నొప్పంటే ఏమిటో తెలుసుకోవాలంటే, అతనికి తలనొప్పనుభవం వచ్చి తీరాలి. లేదా అతని తలపై బాది నొప్పంటే ఏమిటో గ్రహిం పజేయాలి.

కనుక తెలివితో గ్రహించ శక్యం కానిదేదో ఆ ఆధ్యాత్మికానుభవంలో ఇమిడి వుంది. సర్వవ్యాప్తమైన ధ్యాన మార్గంలో అస్తిత్వంయొక్క అనుభవం అగాధంగా వుంటుంది. అది జ్ఞానంయొక్క ప్రతిరూపం. ప్రతి క్షణం జీవిస్తుంది. సర్వ ధర్మా లన్నిటా ప్రతిఫలిస్తుంది. అనుభవంలో దానికున్న సంబంధం చాలా బలమైంది. పరిమితమైన మానవ మేధ కది అంతు చిక్కదు. జీవన్ప్రవాహంలో తమను తాము దిద్దుకోలేని వారు, జీవిత సత్యాలను తెలుసుకోలేక, మాయాకల్పిత జగత్తులో రక్షణ కొరకు పరితపిస్తారు.

నవ మానవాళిని నూతన శక్తితో నింపి స్ఫూర్తినిచ్చే ఆధ్యాత్మికానుభవం ప్రతిస్పందించి, జీవిత కోరికల నుండి రక్షణ కల్పిస్తుంది. భ్రమల్లో చిక్కుకోకుండా, తన ప్రత్యేక ఉనికిని నిలుపుకొనుటకు చేసే ప్రయత్నంలో మానవుడు, అనేక రూపాల్లో మతపర కర్మకాండలు, వైదిక కర్మలు, మూఢాచారాలు, నమ్మకాలు మొదలగు వాటికి బందీలై నిజ జీవితాన్ని గుర్తించలేక పోతున్నాడు. నిజాని కివన్నీ జీవితాని కవసరమైతే, ఎంతో విలువైనవే కాగలవు. కానీ అవన్నీ ఎక్కువగా పేరు ప్రఖ్యాతు లపేక్షించే ఉద్దేశ్యాన్ని రేకెత్తిస్తాయి. అందువలన వాటితో ఏమాత్రం సంబంధం పెట్టుకున్నా జీవనస్రవంతిలో ప్రతిబంధకా లవుతాయి.

“నవ మానవాళి” పరిమిత జీవనానికి దూరంగా వుండాలి. పురోగమించే జీవన స్రవంతికి ప్రతిబంధకం కారాదు. బాహ్య రూపాలతో బంధాలు తెంపుకోవాలి. అప్పుడే భ్రమలన్నీ తొలగుతాయి. బంధవిముక్తు లౌతారు. అనాసక్తత కలుగుతుంది. యుద్ధ భయం వుండదు విరోధభావం రాదు. హింసమార్గం పోతుంది. స్వాభావికమైన అనాసక్తత కలుగుతుంది. చూడండి! మూడు పిల్లల వెంట ఓ కుక్క పరుగు మీద దూకాలనుకొంది, అప్పుడు మీరేమి చేయాలి? మెదలకుండా నిలబడతారా? ఆ కుక్కను చంపుతారా? మీరు మెదలకుండా నిలబడితే మూడు పిల్లల చావుకు కారకు లౌతారు. లేదా కుక్కను చంపితే హింసించినవారౌతారు. ఇది మీ తెలివితేటలు చెప్పే నిజం. ఇదే కృష్ణుడు చెప్పింది. హింస,

అహింసల ననుసరింపవద్దు. రెంటియందు అనాసక్తుడవై పో. మీవాడు పిల్లల మంచికోసరం నీ వా కుక్కను చంపవల్సిందే. ఇదే అర్జునిని విషయంలో జరిగింది. స్వార్థం, లోభం, మోహ పూరితమైన పులులవంటి వారినుండి రక్షించి, తక్కినవారి ఆధ్యాత్మిక మంచి కొరకు అర్జునుడు యుద్ధం చేయవలసి వచ్చింది.

అదేవిధంగా, మానవాళి యొక్క ప్రస్తుత క్లిష్టపరిస్థితుల్లో, సరియైన అవగాహన పొందాలంటే నిత్య సత్యాల్లో, లోతుగా దృష్టి సారించాలి. భావి నవ మానవాళియొక్క అవకాశాలు, ప్రస్తుత ప్రపంచ వ్యవహారాల్ని బాహ్యంగా చూచేవారి తెలివిలో నిగూఢంగా వున్నాయి. కామ క్రోధాలు, ఈర్ష్య ద్వేషాలు, భరించలేని బాధల్ని తయారు చేస్తాయి. అయితే ఎటువంటి వినాశకర శక్తుల మధ్య వున్నా అక్కడ తప్పక ఏదో ఒక రూపంలో ప్రేమ వుండి తీరుతుంది.

నవ మానవాళి, కొలువ శక్యం కానంత అపరిమిత ప్రేమ విడుదల ద్వారా అస్తిత్వంలోకి వస్తుంది. మరి యిలాంటి ప్రేమ ప్రవాహం, సద్గురువులు కలిగించు ఆధ్యాత్మిక మేల్కొలుపు వలననే సాధ్యపడుతుంది. కేవలం సంకల్పమాత్రం చేత ప్రేమ జనించదు. ఆత్మ నిగ్రహ సాధన ద్వారా కర్తవ్య పరాయణుడు కావచ్చును. కష్టించి, కృషిచేసి, ఎవరైనా సరే తన అభిమతం ప్రకారం, మంచి అనుకున్న దానిని సాధించుటలో కృతకృత్యుడు కావచ్చును. కానీ అట్టి చర్య ఆధ్యాత్మికంగా ఫలించదు. ఎందు

# 12. మెహెర్‌బాబా ఆణి ముత్యాలు

ప్రేమ విస్తృతాన్ని మీ హృదయాంతరాళాల్లో నాటుటకే నా రాక.

*

నన్ను మీ సహచరునిగా చేసుకోమని నేను కోరుతున్నాను. మీ గురించి కంటే నన్ను గురించి ఎక్కువగా ఆలోచించండి.

*

నన్నర్థం చేసుకొనుటకు ప్రయత్నించకండి. నా లోతు కొలవ శక్యం కానిది. కేవలం నన్ను ప్రేమించండి. మీరు నన్ను ప్రేమిస్తే మీకూ నాకు మధ్య అడ్డేదీ రాదు.

*

ప్రేమ దైవం, కామం సైతాను. ప్రేమ కోసరం ఏమనుభవించినా అదంతా మంచి కోసరం అనుభవించినట్లే.

*

నోటి మాటల్ని దేముడు వినడు. మనస్సు చెప్పే భాషను అసలే వినడు. హృదయ భాష కాయన స్పందిస్తాడు.

*

భాగ్యవంతుడవైనా, పేదవాడివైనా, సుఖంగావున్నా, బాధల్లోవున్నా, వున్నదాంతో తృప్తిపడు. నీ మంచికే భగవంతుడలా నిర్ణయించినట్లు తెలుసుకో.

*

సంస్కారాలు తుడిచి వేయబడుటకు, భక్తియోగం, కర్మ యోగాలు చక్కని నివారణోపాయాలే, కానీ సద్గురువుకు సమర్పణ గావించుకొనుట అన్నిటి కంటే చక్కని నివారణ.

నీ పరోక్షంలో నిందించే వాడిపై కోపం తెచ్చుకోకు. తిట్టినా తృప్తిగా సంతోషంతో వుండిపో. దాని వలన అతడు నీ సంస్కార భారాన్ని తగ్గించుటలో సహాయ పడుతున్నాడు తద్వారా తన సంస్కారాల్ని పెంచుకుంటున్నాడు కనుక అతని యందు జాలిని చూపించు.

*

మాయను నాశనం చేయుటకు నేను రాలేదు. ఏమీ లేంది మాయ. మాయంటే ఏమీ లేనిదన్న విషయాన్ని మీరు తెలుసు కునేటట్లు చేయుటకే నా రాక.

*

ప్రతి హృదయంలోనూ నివశించే ఆ సనాతనుడ్ని నేను.

*

నోరు నదుపు చేసుకోలేని వాడు, మనస్సు నదుపు చేసుకోలేడు. మనస్సు నదుపు చేసుకోలేనివాడు తన చర్యల నదుపు చేసుకోలేడు. తన చర్యల నదుపు చేసుకో లేనివాడు తనను తా నదుపు చేసుకోలేడు. తనను తా నదుపు చేసుకోలేని వాడు పరమాత్మను పొందలేడు.

*

మాయంటే భ్రమ కాదు. అది భ్రమను సృష్టించేది. మాయ అబద్ధం కాదు. అది అబద్ధాన్నిస్తుంది. మాయ అసత్యం కాదు. అది సత్యాన్ని అసత్యంగాను, అసత్యాన్ని సత్యంగాను తయారు చేస్తుంది. మాయ ద్వంద్వం కాదు అది ద్వంద్వాన్ని కలుగజేస్తుంది.

దేనిని గూర్చి వ్యధ చెందకుము. నన్ను గూర్చియే ఎల్లప్పుడూ ఆలోచించుము. ఉన్నవాడను నేనొక్కడనే. అన్నిటికీ మూలం నేనే.

*

మీరు అవతార పురుషునికి సమకాలికులైనందున, ఇతరుల కంటే మీరదృష్టవంతులు

*

భగవంతుని గురించి తెలివితేటల్తో వాదించుకుంటే, అవి నిన్నాయన చెంతకు చేర్చవు. పై పెచ్చు యింకా దూరంగా తీసుకుపోతాయి, అయితే విడువకండా చేసే హృదయ పూర్వక ప్రార్థనలు, నిన్ను చీకటితో కప్పి వుంచిన తెరను తొలగించును.

*

మాయకు ప్రధాన ఆధారాలు కామ, క్రోధ, లోభాలు. నీవు వాటిని జయిస్తేనే తప్ప, దైవసాన్నిధ్యం చేరే మార్గంలో అడుగిడలేవు.

*

అసలైన సన్యాసిగా వుంటే శ్లాఘించవచ్చు. అయితే కపట సాధువు కంటే నిజాయితీ గల గృహస్థు చాలా మెరుగు.

*

వినయమనే పీఠం మీద మనం దైవాన్నారాధించాలి. ఆధ్యాత్మికంగా వినయం భక్తి కంటె ఎక్కువ విలువైంది. అయితే చాలా వాటిల్లో భక్తి వినయానికో మెట్టువంటిదని రుజువు చేసింది.

*

ఏకత్వంలో నిజమైన సుఖం ఇమిడి వుంది. అనేకత్వంలో కష్టాలున్నయి.

ద్వేషం వెంట పగ వుంటుంది. ప్రేమ వెంట క్షమ వుంటుంది. యితరుల తప్పులను మరచి క్షమించే చక్కని అలవాటును ప్రేమలేందే చేసుకోలేరు.

*

ఈ భౌతిక ప్రపంచమే సత్యమని అనుభవించే వారంతా నిద్రావస్థలో వున్నట్లే. దాని నసత్యంగా భావించేవారు మాత్రమే, భగవంతుని గుర్తించి మేల్కొన గలరు.

*

సూర్యోదయంతో చీకటి అదృశ్యమైనట్లు, మాయ అనే చీకట్లో వున్నవారు, అన్ని వేళలా సర్వత్రా భగవంతుడున్నా చూడలేకున్నారు.

*

యదార్థ ప్రేమికుడు, తాను భగవంతుని కొరకు మరణించి నప్పుడే యదార్థ జననం పొందును. ఎవరైతే తమ సర్వస్వం నాలో పోగొట్టు కుంటారో వారు సర్వస్వాన్ని నాలో ఎల్లప్పుడూ చూడగలరు.

*

భౌతిక దృష్టి వున్నప్పటికీ దైవాన్ని చూడలేని వారు అంధులే అగుచున్నారు. చూడ తగిన ఏకైక పదార్థం దేవు డొక్కడే కనుక కళ్ళుండీ దైవాన్ని చూడలేని వారి కంటే దైవాన్ని ప్రేమతో అంతరంగంలో ఆరాధించే పుట్టంధులు మేలు.

*

ప్రేమ అగ్నికి ఆజ్యం పోస్తుంది. మనం దానిని చూడ గలిగినప్పుడు, అది మన పెదవులను, ఎట్టి పొగ బయటకు రాకుండునట్లు గట్టిగా మూసి వుంచుతుంది.

పరిపూర్ణ విధేయతంటే, ధూళిగా మారుట. ధూళికి దానిని గురించిన ఆలోచన వుండదు. దాని నెవరైనా త్రొక్కినా లేదా అది లేచి ఎవరి నుదుటిపైనైనా పడినా, గాలిలో ఎగిరినా, నీటిలో కలిసినా, అది ఎక్కడవున్నా, దాని నెవరేమి చేసినా, నిశ్చలంగా వుంటుంది. అన్నీ దానికి సమానమే.

*

భగవంతుడు ప్రేమించ బడుటకేగానీ, భయపెట్టుటకు కాదు. భగవంతుని చూచుటంటే, భగవంతుని మాత్రమే తప్ప, తక్కిన వాటిని చూచుటను వదలుటన్న మాట.

*

మరణించిన వారిని బ్రతికించుటలో మహత్తులేదు. వున్న మహత్తల్లా, జీవించిన వారిలో అహం మరణించునట్లు చేయుట. మహత్తులనేవి అతి చిన్న మిథ్యా చర్యలు. ప్రపంచమనే పెద్ద మిథ్యలో ఇవి చిన్న మిథ్యలు.

*

భగవంతునితో ఐక్యం కావాలని కోరుకోవద్దు. ఆయన ఎడబాటుకు విలపించవద్దు. కేవలం ఆయన యిచ్ఛను మాత్రమే కోరుకొనుము.

*

యదార్థ సుఖం, యితరులను సుఖపెట్టుటలో దాగివున్నది.

*

ఎవరైతే తమ హృదయ మందిరంలో వున్న ప్రభువును చూడలేరో, వారు యదార్థ అస్పృశ్యులు.

దాదాపు మానవులందరి వునికీ, మనస్సు యొక్క అధీనం క్రింద వుంటుంది. కానీ చాలా అరుదుగా ఏ పదివేల మంది లోనో ఒక్కడు మాత్రం మనస్సును తన అధీనంలో వుంచుకొని అజమాయిషీ చేస్తాడు.

*

సుఖం-దుఃఖం, పుణ్యం-పాపం, సంతోషం-బాధ, స్వర్గం-నరకం, చావు-పుట్టుకలివన్నీ మనస్సుచే సృష్టింపబడేవి. అవన్నీ మనస్సు పై ఆధారపడి వుంటాయి.

*

ప్రాపంచిక కోరికలకు బానిసగా మార్చేది మనస్సు. అలాగే ప్రాపంచిక కోరికల కోరలనుండి తప్పించి, తన గమ్యం చేర్చి, దైవసాక్షాత్కార ప్రాప్తి కలిగించేదీ మనస్సే.

*

ప్రపంచాన్ని మరచిన వాడు యోగి. స్వర్గ నరకాలనే తదుపరి ప్రపంచాల్ని మరచిన వాడు ఋషి. దైవాన్ని మరచుటంటే, సాక్షాత్కారము పొందుటే మరుపును మరుచుటంటే పరిపూర్ణత్వం పొందుట.

*

జీవాత్మే పరమాత్మగా తెలుసు కొనుటంటే, సత్యాన్ని తెలుసుకొనుట. వూహాజనితమైందీ జగత్తు. కనుక నీ యదార్థాత్మ లోతులు తెలుసుకొనే బదులు వూహాజనితజగత్తు గురించేల తెలుసు కొనుటకు ప్రయత్నించెదవు?

మంత్ర తంత్రాలతో కూడిన కర్మ కాండలా చరిస్తే భక్తనిపించుకోదు. భక్తంటే దైవ నామాల్లో ఏదో ఒక నామాన్ని విడువక జపిస్తూ, దైవాలోచనతో దేముణ్ని గుర్తుంచు కోవటం.

*

నిజమైన నిస్వార్థ సేవంటే, ఎట్టి ఫలాపేక్షలేకుండా ఇతరులకు సేవ చేయడం. ఇతరులను మొహమాట పరచి, వారి మెప్పుకోరి చేసే సేవ, సేవ కాదు.

*

లక్షలాదిమంది, భగవంతుడు తప్ప మరేదీ లేదని చెప్పినా, చాలా మందికి భౌతిక ప్రపంచమే సర్వస్వం. వారు భగవంతుడసత్యమన్న భ్రమలోవుంటారు.

*

నాకృపకు మీరు పాత్రులైనచో మిమ్మల్ని మీరున్న స్థితి నుండి, మీ రెచ్చట వుండవలెనో నిర్ణయించి అట్టి స్థాయికి ఒక్కసారిగా తీసుకుపోదును.

*

నన్ను నన్నుగా గ్రహించుటకు, మీ హృదయమందు చంటి పిల్ల వానివలెనూ, జ్ఞానమందు వయో వృద్ధునిగానూ మెలగండి.

*

ప్రేమ కొరకు నీవు బేరసారాలు సాగించ లేవు. తపస్సు, ధ్యానము, పూజా పురస్కారాలు నీ వెంత చేసినా, ప్రేమ ప్రసాదాన్ని నీకవి అందించ లేవు.

నా సాన్నిధ్యం, నాతో చనువు, సంతుచితమైన సంస్కారము లను మార్చును. నీ ఉఛ్వాశ, నిశ్వాసల కంటే నేను నీకు ఎక్కువ దగ్గరగా వున్నాను. మీ విధేయతనే తప్ప మరేదీ మీ నుండి నేను కోరుట లేదు. నన్ను గూర్చి తక్కువాలోచించి నన్ను గురించెక్కువ యోచిస్తే నీలోని అహం నశించి బాబా నీయందావిర్భవించును.

*

భౌతిక మైన సుఖాల కొరకు ప్రాకులాడకు. స్త్రీ పురుషు లెవరైనా సరే నా నామాన్ని తుది శ్వాస విడుచు నప్పుడు తమ పెదవులపై స్మరిస్తే అట్టివారు నన్ను చేరుకొందురు.

*

మీరేమియు త్యజించ పని లేదు. సాధారణ గృహస్తుగా ప్రాపంచిక వ్యవహారాలు సాగిస్తూ నిరంతరం నన్ను స్మరిస్తే మీరు నాలోనే జీవించినట్లు.

*

నీవు పని చేస్తావు. మరి నీవా మనస్సనే తెర నుండి విముక్తుడవైనప్పుడు పరమాత్మతో ఒకటి కాగలవు.

*

ఆత్మ పరమాత్మ, భూమికలు, గ్రహాలు మరియు యీ జగత్తంతటిలోను నీవున్నావు. కానీ నీవా సంగతి ఎరుగవు. అవన్నీ నీలోనే వున్నాయి. అయితే నీవు వాటిని చూడలేవు. ఏలననగా నీవు నీలోనే వున్న యదార్థం ఆత్మతో కాక మామూలు దృష్టితో చూచెదవు.

*

# 13. దైవ రక్షణ

ఉధృతమైన నదీ ప్రవాహంలో ఒండ్రు బురద కొట్టుకు పోతుండే తప్ప, ప్రవాహ వేగాన్నాపలేదు. ప్రవాహ వేగ తాకిడిలో చెట్లు చేమలు, ఒడ్డున వుండే మట్టి సమస్తం కొట్టుకుపోతై. అలా కొట్టుకుపోయే అడ్డంకులన్నీ నదీ గర్భంలోనే ప్రవాహ వేగానికి అడ్డంకు లౌతాయి. నదీ ముఖద్వారం చేరేచోట దిబ్బలుగా మేట వేస్తాయి. నదిని పాయలుగా చీలునట్లు చేస్తాయి. ఎంత బ్రహ్మాండ వరదల్లోవున్న నదికైనా, యీ తాకిడి తప్పదు. అలాగే, ఆధ్యాత్మిక ప్రయాణంలో స్వయంకృతమైన అవరోధా లెన్నో ఎదురౌతాయి. అవన్నీ కేవలం గురువు మాత్రమే తొలగించ గలడు.

ఒక గురువందిచ్చే సహాయంకంటే, దైవ మానవుని సహాయం ఎక్కువ పని చేస్తుంది. దైవ మానవుని ఒక వటవృక్షంతో పోల్చుకోవచ్చును. మర్రిచెట్టు కొమ్మ ఊడలతో విస్తరిస్తుంది. బాటసారులకు నీడనిస్తుంది. విశ్రమించుటకు చోటిస్తుంది. బలమైన కొమ్మలతో దశ దిశలా ఊడలు పెంచి, దూర తీరాల వరకు విస్తరిస్తూ నేలలో బలంగా వేళ్ళూనుతుంది. నేలలో పాతుకున్న ఊడలు పెరిగి మరో మర్రి వృక్షం పెరుగు తున్నట్లుగా బలపడుతుంది. సూర్యరశ్మి నుండి, వర్షము తుఫానుల నుండి వటవృక్షం తన నాశ్రయించిన బాటసారులకు

అందుకా చీమ "అవును, నేను మునిగినప్పుడు, యిహ నాకీ ప్రపంచం వుండదు కదా ? అందుకే నేను మునుగు తున్నానంటే, యీ ప్రపంచం కూడా నాతో మునుగుతోం దన్నమాట" అన్నది.

అదే మాదిరి సర్వమూ నీలోనే వున్నాయి. దైవం నీలోనే కనపడతాడు. నీ వొకసారి ఆయన్ని చూచావంటే, చూడవలసిన అమూల్య సంపదను కనుగొన్నట్లే.

# 15. దైవ సన్నిధికి దగ్గరిదారి

రాత్రింపగళ్ళు గురువు గురించే ఆలోచించే శిష్యుడు ధ్యానము, ఏకాగ్రతల ద్వారా అనేక శిక్షణలు పొంది లక్ష్యాన్ని చేరుకోవచ్చు. సద్గురువు నన్నిటి కంటే అధికంగా ప్రేమించుట వలన, శిష్యుడు సత్యాన్ని పొంది దానితో ఐక్యమైపోతాడు. ఇదే ఆధ్యాత్మిక సాధనకు లక్ష్యం. దీన్ని గురు కృపచేత మాత్రమే పొంద గలరు.

భగవంతుని చేరుటకు, మానవు లెన్నెన్నో క్రతువులు కర్మ కాండలు చేయు చున్నారు. వీరి ప్రయాణం, అనేక మజలీల్లో ఎప్పుడూ ఆగుతూ పోయే గూడ్సు రైలువంటిది. భగవంతుని భక్తి పూర్వకంగా ధ్యానిస్తూ తమ జీవితాల్ని అంకితంచేసి సాధించే కొంతమంది ప్రయాణాన్ని మామూలు ప్రయాణీకుల రైలు బండితో పోల్చవచ్చును. టైంటేబుల్

ప్రకారం అన్ని రైలు స్టేషన్లలోనూ ఆగుతు పోయే ప్రయాణీకుల రైలు వంటిది, వీరి ప్రయాణం.

అయితే పరిపూర్ణుడైన సద్గురువు నాశ్రయించి, ఆయనకు విధేయుడై, సర్వమూ అర్పించి, శరణాగతుడైన వాడు. ఏ స్టేషనులోనూ ఆగకుండా వెళ్ళే ప్రత్యేక రైలులో ప్రయాణం చేసి, మధ్యదారిలో మజలీ లేవీ లేకుండా, సాధ్యమైనంత తక్కువ వ్యవధిలో గమ్యం చేరే ప్రయాణీకుని వంటి వాడు. నేను మీకు నా ఆశీర్వాదము లందిస్తున్నాను. మీరు భగవంతుని ప్రేమించి ఆయనను కనుగొందురు కాక !

## 16. కర్మ సిద్ధాంతం

మానవుడు తప్పించుకోలేని స్థితిలో చిక్కుపడ్డాడు. అతని పూర్వకర్మ అతని జీవన స్రవంతిలో ఒకప్పుడొక వైపూ, ఇంకొకప్పుడు మరోవైపూ లాగుతూ ఒత్తిడిని కలుగజేస్తూనే వుంది. యీ ప్రారబ్ధకర్మ జీవితము యొక్క అన్నిరంగాల్లోనూ, తన ప్రభావాన్ని చూపిస్తుంది. పేరుకొనివున్న గత జన్మ అనుభవాలలో చాలా ముఖ్యమైన స్మృతులను, వాటి స్వభావాను సారం అనుభవించి తీరాలి. ఇవి కేవలం బాహ్యాబంధాలేకాని ఆత్మ తత్వానికి చెందినవి కావు. ఇవే పూర్వ కర్మాను బంధాలు. ఇవి ఆత్మను శక్తివంతంగా బంధిస్తై. మనస్సులో నిలబడిపోయిన స్వాభావిక లక్షణాలివి. వీటిని తప్పించు కోవటం అసంభవం.

మనస్సు జీవిత కాలంలోనూ, మరణానంతరం కూడ వుంటుంది. భూమిమీద, స్వర్గ నరకానుభవాలలోనే కాక అనంతంగా జరిగే జనన మరణ పరంపరలో కూడ మిగి వుంటుంది. యీ మనస్సు జీవుణ్ణి ఎన్నడూ వదలిపోదు. ఆత్మ సాక్షాత్కారం కలిగినప్పుడే మనస్సనేది లేకుండా పోతుంది. ఆధ్యాత్మిక దృష్ట్యా చూస్తే, బాహ్య పరిస్థితులు కల్పించే బంధాల కంటే, ఎవరి మనస్సు యొక్క స్వభావరీత్యా వారికి కలిగే బంధాలు అంతులేనివి.

గత జన్మల అనుభవాల బరువును మోయుటవలన జీవుడు స్వేచ్ఛగా ప్రవర్తించలేడు. "అహం"తో చుట్టబడిన మనస్సు తన సంస్కారాల్ని తానే బలపరచుకుంటూ తన చుట్టూ కోట కట్టుకుంటుంది. గతాన్ని మార్చే వీలులేదు. జరిగిపోయిన సంఘటనలు బండబారి వున్నాయి. ఆ గతమే మన వర్తమానాన్ని రూపొందిస్తుంది.

అన్ని విషయాలు ఏదో ఒక నియమాన్ననుసరించి నిర్ణయించబడతయి. ఎందుకూ లెక్కకు రాని వ్యాపార సంస్థలు, ప్రజా సంస్థలు కూడ, వాటి పరిపాలనకు సంబంధించిన నియమావళి కలిగివుంటై. అది లేకుండా ఏ సంస్థా పనిచేయ లేదు. యీ సత్యం విశ్వం విషయంలో కూడ వర్తిస్తుంది. బాహ్యంగా చూస్తే యీ ప్రపంచం, ఏవైనా సిద్ధాంతాలకు కట్టుబడి వుందా ? అనిపిస్తుంది. ఒకోసారి, కష్టపడి చేసిన పని వ్యర్థమైనట్లు, నిజాయితీపరులు బాధలకు గురైనట్లు, దుష్టు

లధికారాన్ని చేజిక్కించుకున్నట్లు తోస్తుంది. కర్మ సిద్ధాంతం తెలియనందువల్లే ఇలాంటి అభిప్రాయాలు కలుగుతై.

పరిమితమైన అహంకారం, జీవితాన్నర్థం చేసుకోలేక, అనాదిగా పేరుకొనివున్న దుష్టభావాల వత్తిడిని ఎదుర్కోలేక శాంతిని కోల్పోతుంది. అంతటది, మంచీ చెడులను అప్రయత్నంగా ప్రకటించవలసిన స్థితిలో పడిపోతుంది. ఫలితంగా, ఆ మంచీ, చెడుపనుల ఫలితాలను మూటకట్టుకుంటుంది. మనోవాక్కాయ చేతలన్నీ లెక్కకు వచ్చి మనస్సు బరువెక్కుతుంది.

మనస్సు తాను చేసిన మంచీ, చెడుల పనుల వలన వచ్చే ఫలితాల్ని అనుభవించకండా తప్పించుకోలేకపోవుటకు కారణం కర్మ సిద్ధాంతం. గతించిన కర్మ ఫలాల వత్తిడి క్రమంగా బలపడి, మనస్సును బాధిస్తై. అందుచేత మనస్సుకు నిజమైన స్వాతంత్ర్యం లేకపోగా, ఒకవైపు పరిస్థితుల ప్రభావానికి ఎదురయ్యే దెబ్బలు, రెండోవైపు మనస్సులో జీర్ణించివున్న వాసనల ప్రోద్బలాలకు గురై తట్టుకోలేదు. కానీ మనస్సుకు నిలకడ సంపాదించాలనే ఆకాంక్ష తీవ్రంగా వుంటుంది. పోయిన పట్టును పొందాలనే ప్రయత్నంలో వున్న పరిస్థితులను తీవ్రంగా వ్యతిరేకించడం, మరొక వ్యతిరేక స్థితిని అంటిపెట్టుకోవడం, అనాలోచితంగా జరుగుతుంది.

కాబట్టి, యీ కర్మ సిద్ధాంతానుసారం మనస్సు ఒక చివరనుండి వేరొక చివరకు వూగుతూ వుంటుంది. ఇదంతా

మిథ్య అయినప్పటికీ, అనాదిగా, బాధలు పడుతూ, ఎన్నో పరీక్షలకు గురౌతూ, మనస్సు, కర్మ, ప్రతిక్రియ వ్యతిరేక శక్తులకు లోనై, సంసార బంధంలో తిరుగుతూ వుంటుంది. అటువంటి స్థితిలో, సద్గురువు తటస్థపడి, ఆయన ఆశీర్వాదం లభించే వరకూ యిది తప్పదు.

## 17. ద్వంద్వముల నుండి విముక్తి

ప్రతి మానవుడు సుఖదుఃఖానుభూతులకు గురౌతూనే వుంటాడు. ఇందులో సంతోషం—బాధ, జయాపజయాలు, మంచీ చెడు, ధనం దారిద్ర్యం, గౌరవాగౌరవములు, లాభ నష్టాలు, ఆశా నిరాశలు మున్నగున వెన్నో వున్నాయి.

ఈ ద్వంద్వాలన్నీ మనస్సు యొక్క అనుభూతినిగానీ, కర్మనుగానీ ప్రేరేపిస్తూనే వున్నయి. ఈ ద్వంద్వాల వూపు వచ్చినప్పుడల్లా, మనస్సు, తన స్థానం నుండి తొలగిపోతూ, మళ్ళీ స్థాయిని చిక్కించుకుంటూ వుంటుంది. అహంకారం మానవజన్మ ఎత్తుతూ అనేకసార్లు యీ ద్వంద్వాల మధ్య, ఊగిస లాడుతూ, అంతులేకండా తిరుగుతూ వుంటుంది. ఒకప్పుడు భోగలాలసత్వం, మరొకప్పుడు సన్యాసం, మత రహిత జీవితం, మతాధిక్య దురభిమానం, ఆత్మ గర్వ ప్రదర్శన, ఆత్మ వినయ ప్రకటన, ఆత్మ అంతర్దర్శనము, ఆత్మ బహిర్దర్శనం, గుణమూ దోషమూ, సుఖం దుఃఖం, నేనూ నీవు, నాదీ నీదీ అనే ద్వంద్వాల

మధ్య తిరుగుతూ వుంటుంది నిలకడ స్థానం తెలియక. నిజం తెలిస్తే గానీ నిజమైన స్థానంలో నిలబడలేదు.

అతి వాదముల మధ్య మనస్సు తిరుగుతూనే వుంటుంది. ఇది అభివృద్ధికి వ్యతిరేకం అవుతుంది. అందుచేత, అది నిలకడ స్థానాన్ని దాటుకుంటూ పోతుందే తప్ప అక్కడ నిలబడలేదు. ద్వంద్వములనుండి విముక్తి చెందిన ఆత్మ శాశ్వతమూ అనంతమూ నైన, భగవత్తత్వముతో అనుసంధింపబడి, లోపలినుండి శక్తిని పొందుతూ, శాశ్వతానందాన్ని జ్ఞానాన్ని ప్రేమను, పొంది పరిపూర్ణ సుఖం అనుభవిస్తుంది.

మనస్సును, తాత్కాలికంగా కొంతమంది, కొంతవరకు అదుపు చేయకలిగినప్పటికీ బహు కొద్దిమందిలో కొద్దిమంది మాత్రం దివ్య ప్రేమ ద్వారా, మనస్సును పూర్తిగా స్వాధీన పరచుకొని ఆధిపత్యం సాధింప కలుగుతున్నారు. క్రమేణా తుదకు దైవ ప్రేమ, మనస్సును కూడ నశింపుచేసి, చివరకు మిగిలిన ప్రియతముడైన భగవంతుని సాక్షాత్కారం కలుగజేస్తుంది.

నీ మనస్సును ప్రశాంతంగానూ, నిశ్చలంగానూ, దృఢం గాను వుంచుకో. కోరికలను లొంగనీయవద్దు. మనస్సును నిగ్రహించుటకు యత్నించు. వాక్కును నిగ్రహించుకోలేనివారు, మనస్సును కూడ నిగ్రహించుకోలేరు.

# 18. నిస్వార్థ సేవ

దైవానికి తాను మానవుడ నన్న చైతన్యం వుండదు. మానవునికి తాను భగవంతుడ నన్న ఎరుక వుండదు. కానీ దైవ మానవుడు లేక అవతారుడు తాను భగవంతుడననీ, మానవునిగా అవతరించాననీ రెండూ ఎరుకతో ఉంటాడు. అందుకే అవతారుడు ప్రభువుగానూ, అందరి బరువూ మోస్తూ యీ విశ్వానికి సేవకునిగానూ నిరంతరాయంగా ఉంటున్నాడు. మరి అందరికీ సేవచేసే అవతారునికి సేవ చేయడమంటే, యీ విశ్వానికే సేవ చేయడమన్నమాట.

నిస్వార్థ సేవ, ప్రేమ యీ రెండూ జంట లక్షణాలు. ప్రేమించువాడు మాత్రమే నిస్వార్థ సేవ చేయగలడు. ప్రియతము డైన అవతారునికి సేవ చేస్తే, అందరిలోనూ ఉన్న నీ ఆత్మకే సేవ చేసినవాడ వగుదువు. నేను ఆశించే సేవ, నీ ఆధ్యాత్మికలాభం కొరకే. మరి యీసేవ నీ యిష్టంతో నీఅంతట నీవు హృదయపూర్వకంగా, బేషరతుగా, ఎట్టి ప్రతిఫల మాసించకుండా ఉండాలి.

ఆయనకు చేసే సేవ, శరీరానికి, మనస్సుకి, ఆత్మకు అగ్నిపరీక్షవంటిది. శరీరం బాధ పడుతుంది: మనస్సు వేదన

అనుభవిస్తుంది. అయినా ప్రియతమునికి నిస్వార్థ సేవ చేసినందు వలన ఆత్మ తృప్తి పొంది, ఆత్మానందం అనుభవంలోకి వస్తుంది.

ఉన్నవాడే త్యాగం చేయగలుగుతాడు. రాజు అన్నీ వదిలేసి బిచ్చగాడయ్యాడంటే, అదే నిజమైన త్యాగం. అందు వలన, మారు ప్రశ్న వేయకుండా, ఎలాగైనా సరే అవతారుని సేవిస్తే అదే నిజమైన సేవ అవుతుంది. లేకపోతే అది కూలికి చేసిన సేవ క్రిందే లెఖ్ఖ.

సేవంటే ఏది పడితే అది కాదు. మీరు సేవ చేయ డానికి ఒప్పుకోవడము, ఒప్పుకోకపోవడము అనే భావాలు మీలో ఉండకూడదు. మీ శరీరానికి మీరే ప్రభువన్న భావం రాకూడదు. మీ శరీరము మీ గురువుదే, అది మీ గురుసేవ కొరకే వున్నదని అనుకోవాలి.

క్షణికమైనదానికి దాసుడై మానవుడు శాశ్వతమైన దానిని వదులుకుంటున్నాడు. మానవుడు గడిపే ప్రతి క్షణం, అనిత్య మైన ప్రపంచానికి, గట్టిగా బంధింపబడటమో, లేదా సత్యాన్వేష ణకు సమర్పణ కావడమో జరగాలి. భగవంతుడొక్కడే, సత్యం. ఆయన ప్రేమ, సౌందర్యం, శాంతి, సుఖం మున్నగు వాటన్నింటికీ జన్మస్థానం.

ఈ నాటికే ఈ అసత్య ప్రపంచంలో కూడ భగవంతుడు మానవుడై అవతరించి, అందరినీ తన వద్దకు ఆహ్వానిస్తూనే ఉన్నాడు. మానవ జీవితపు నిజస్థితి "సేవ" అని సాక్ష్యం చెపుతున్నాడు. ఎవరైతే ప్రతి వస్తువులోనూ, పదార్థంలోనూ, విషయంలోనూ భగవంతుని చూసి, ప్రేమిస్తారో వారు భగవంతుని నిత్య సన్నిహితమైన శాశ్వతునిగా అనుభవించి ప్రేమించగలరు.

సంసార యాత్రలో అనుక్షణం ఎదురయ్యే పరిస్థితుల నుండి మనుష్యుని విడిపించాలంటే, అసత్య సంసారాన్నుంచి మరల్చినప్పుడే సాధ్యపడుతుంది. నిజమైన ఆధ్యాత్మిక సేవ చేయాలంటే, శిష్యుడు అన్నిటికీ సిద్ధపడి ఉండాలి. దైవకార్యం నెరవేర్చే ఉద్యమంలో అన్ని రకాల పరిస్థితులకు అనుకూలంగా ప్రవర్తించ కలిగి ఉండాలి. ఇతరులు తనను లక్ష్యపెట్టక పోవచ్చును. ఒక్కొక్కప్పుడు తనను నిర్లక్ష్యంగానూ, ద్వేషంతోనూ చూడవచ్చును. లేనిపోని నిందలు కల్పించవచ్చును.

ఎలాంటి నిరసనలు ప్రతిధ్వనించినా, అవి నీ యదార్థ జ్ఞానాన్నికానీ, విశ్వాసాన్నిగానీ సడలింపకూడదు. వాటి వలన నీవు చలించకుండా ఉండాలి. నీపై జరిగే దాడిని నిజమైన వినయంతో బంతిలా ఎదుర్కోవాలి. అంటే కాలితో తన్నితే బంతివలె పైకెగరకలిగి నీ గమ్యం చేరుకోగలగాలి.

# 19. ఆత్మ భ్రాంతి

పుట్టడమనేది యీ భూమిపై ప్రతి ప్రాణికి అతి సాధారణ విషయం. ఎటువంటి విశిష్టత లేకుండా, ఎక్కడో పుట్టి, తన ప్రమేయమేమీ లేకుండా, జీవితం గడిపి, చనిపోయే జీవుల్లాకాక, మానవజన్మ ఎత్తడమనేది పరిణామ క్రమంలో అంతిమ దశ అని చెప్పవచ్చును. మానవులు కేవలం యాంత్రికంగా కాక, వారి భవితవ్యానికి వారే బాధ్యులగుచున్నారు. యింతకుముందు విభిన్న శరీరాలలో, ఆకారాలలో, అనేకసార్లు జన్మించి, యిప్పుడు మానవునిగా జన్మించడమంటే, ఇదివరకు పడిన అనేక కష్టాలకు ఫలితంగా, ఆధ్యాత్మిక జననం పొందటమన్నమాట.

ఈ మన ప్రయాణం, ఎక్కడనుంచి? ఎక్కడికి? అనే ప్రశ్నలు తర్కించుకొని, సమాధానం పొందుటకు ప్రయత్నించడమే, యీ ఆధ్యాత్మిక జననం పొందినట్లు అనవాలు. మానసిక సమత్వం ఒకసారి పొందకలిగితే, మానవుడు, పూర్వాచారాలు, అసహనం, గర్వం, స్వార్థం యివన్నీ క్రమంగా వదులుకో కలుగుతాడు. పుణ్యాత్ముడేకానీ, పాపాత్ముడే కానీ, ఒకే సముద్రంపై కనిపించే, చిన్న పెద్ద తరంగాలుగా అగపడతారు. పుణ్యాత్ముడు తన ఔన్నత్యం గురించి గర్వించడు. పాపాత్ముడు తన దౌర్భాగ్యానికి అఘోరించడు. ఎవరూ నిస్పృహ చెందరు.

బాధ పడుతున్న ప్రపంచానికి నేనిచ్చే అద్భుత గుళిక, “ఎక్కడికి?” “ఎక్కడనుంచి?” అన్న ప్రశ్నలకు సమాధానం తెలుసుకొనేందుకు ప్రయత్నించేలా చేయడం. అందరూ జన్మిస్తారు, అందరూ మరణిస్తారు. కానీ జనన మరణాలు రెండింటి నడుమ, సుఖమయ జీవనాకాశమే యీ ప్రపంచంలో జీవితమని తెలుసుకోవడం వలన, ప్రపంచంలో విశ్వమానవ సోదరభావం సాధించుటకు ప్రయత్నించడం జరుగుతుంది.

ఆత్మకు లింగభేదం లేదు. కానీ, ఆత్మ తానే శరీర మనుకుంటే, లైంగికమాయ ఆవరిస్తుంది. ఆత్మ అప్పుడు ద్వంద్వాలకు లోనై ఉంటుంది. సత్యమైన మన అందరిలోని ఆత్మకి లింగభేదం లేదు. స్త్రీలో వున్న జీవాత్మ తాను స్త్రీ అనుకుంటుంది. పురుషునిలోని జీవాత్మ తాను పురుషుడ ననుకుంటుంది. ఇదే భ్రాంతి; అతి సూక్ష్మమైన భేదం. మనమే శరీర మనుకోవడం చేత వచ్చిందీ భేదం.

తాను కానిది తానై వున్నట్లు భావించడాన్ని ఆత్మ భ్రాంతి అంటారు. యీ ఊహ ఎంత బలమైనదంటే, ఆత్మ భ్రాంతి చెందిన మనిషి, తాను ఎలా వున్నాననుకుంటున్నాడో, దానిని గురించి కించిత్తయినా సందేహించడు. తాను నిజంగానే అలా వున్నాను అనుకుంటాడు. మరి ఎంత చెప్పినా ఇది భ్రాంతేకదా!

ఇలా అనుకునేవారు, కపటులు రాకపోయినా, వారు అహాయం కలుగచేయువారౌతున్నారు.

నా పని యిరువులను గమ్యస్థానానికి చేరేలా సహాయ పడటమే. ప్రపంచంలో జీవించాలేగాని, ప్రపంచపు మనిషిలా వుండరాదు. అన్నిటితోనూ, అందరితోనూ సామరస్యంగా జీవించడం చాలా ముఖ్యం.

మతాలు, సాంప్రదాయాలు, మతపరమైన కర్మ కాండలు, ఉపన్యాసాలు, ఉపదేశాలు ఒకవైపున, భౌతిక సంపదలు, ప్రాపంచిక సౌఖ్యాలకోసరం ప్రాకులాడటం మరోప్రక్క—యివేవీ మానవునికి నిజమైన సుఖాన్ని కలిగించలేవు.

అందుకే మీకో ముఖ్యమయిన విషయం చెపుతున్నాను. నేను చెప్పింది విని, తు. చ. తప్పకుండా ఆచరించుటకు ప్రయత్నించండి. మీరు వాదించవద్దు. నేను చెప్పినట్లు చేసి మిగతాది నాకు వదిలేయండి.

మీరు ఎవరినిగురించీ భయపడవద్దు. ఏం జరిగినా మీ నమ్మకంలో దృఢంగా ఉండాలి. మీకు వ్యతిరేకంగా విమర్శించినా లొంగిపోవద్దు. జీవితం ఒక పెద్ద తమాషా. యిది ఎవడు తెలుసుకుంటాడో, వానిని ప్రజలు అర్థం చేసుకోలేరు. ఇది ఎవరు తెలుసుకోలేరో వారు భ్రాంతిలో పడిపోతారు. మన

ఆలోచనలలోను, మన చేతలలోను, నిజాయితీగా వుండాలి. అజ్ఞానం వలన, మాయామోహం వలన జీవితంలో బాధ పెను గొంటాయి. పిల్లలు పాములతో ఆడిన్నే చాలమంది మాయతో ఆడతారు. అశాశ్వతమైన ఈ ప్రాపంచిక విషయాలలో మీరు చిక్కుకుంటే, మాయాస్వరూపమైన విలువలకు మీరు ఆకర్షితులైతే బాధలు తప్పవు. ఇటువంటి జన్మలద్వారా మీరు మాయతో ఆడు కోసుట కలవాటు పడ్డారు. ఈ చిక్కుల్లోంచి మీరు బయట పడటం చాలా కష్టం.

మానవుడు రెండు రకాల అనుభవాలు అనుభవిస్తాడు బాహ్యానుభవం, అంతర్గతానుభవం. బాహ్యానుభవం భౌతిక శరీరంద్వారా వస్తుంది. భౌతికంగా మన కళ్ళతో ఈ భౌతిక ప్రపంచాన్ని చూచినప్పుడు అది యదార్థమన్న నమ్మకం మనకు కలుగుతుంది. ఇది కేవలం భ్రాంతి. ఎలాగంటే, ఒకరు తాటిచెట్టు క్రింద కూర్చుని సీసాలో పాలు పోసుకొని త్రాగుతూ కనపడితే, ఆ దృశ్యం చూచేవారికి, అతను కల్లే త్రాగుతున్నాడన్న భావం కలుగుతుంది. నిజానికిది భ్రాంతేకదా! అంతః చక్షువులతో చూచినప్పుడు మాత్రమే నిజమౌతుంది. దానికి తిరుగు లేదు.

ఈ స్థూల ప్రపంచంలో ప్రతి పైసా లెక్కలోకి వచ్చేదే. అయితే సూక్ష్మలోకంలో ప్రతి చిన్న శక్తి, లెక్కకు వస్తుంది.

పరి మానసిక లోకంలో ప్రతి ఆలోచనయొక్క శక్తి పరిగణింప బడుతుంది. ఈ మూడు లోకాల కావలి స్థితి భగవంతుని స్థితి.

భాగ్యవంతుడు, పేదవాడు, పురుషుడు—స్త్రీ, పెద్దవాడు-చిన్నవాడు, విద్యావంతుడు-విద్యా హీనుడు, అందరికీ దేముని తెలుసుకొనే హక్కున్నది. జిహ్వాయొక్క భాషగా జపం, తపం, మంత్రం, తంత్రం, భక్తి గీతాలు యివేవీ భగవంతుడు వినడు. ధ్యానం వగైరా మనస్సు చెప్పే మాటలుకూడ వినడు. ఆయన వినేదల్లా హృదయం చెప్పే నివేదన. అదే ప్రేమ. ఈ ప్రేమకు ఆచారాలు, వ్రతాలు, కర్మకాండలు ఏమీ అక్కర లేదు. ప్రియతముని ఎడల ధ్యానంతో కూడిన భక్తి కావాలి.

స్థావరమైన రాయివలె భగవంతునియందు స్థిరమైన విశ్వాసము, జ్వలించే ప్రేమ వుంటే యీ ప్రపంచంలో మిమ్మ ల్నేదీ అంటదు. యుగయుగాలుగా మానవుడు తన నీడను చూస్తూ రకరకాల రూపాలతో నిండిన యీ మాయా ప్రపంచంలో మనస్సు లగ్నం చేసుకుంటున్నాడు. యీ భ్రాంతినుండి స్వేచ్ఛ పొందాలంటే అవగాహన కావాలి. దైవ మానవుని యెడల అచంచల ప్రేమ, విశ్వాసము లుంటే శాశ్వత సత్యాన్ని పొందే మార్గం సుగమమైందన్నమాట. నన్ను హృదయపూర్వకంగా ప్రేమించండి. అన్ని భ్రాంతులు దూరమౌతాయి.

# 20. గురువు - అవతారుడు

భగవంతుని నుండి మనల్ని దూరం చేసేవి మూడున్నాయి. కామం, క్రోధం, కాంక్షలు అంటే, కామతృష్ణ, కోపం, లోభాలనేవి మూడు. కామాన్ని లోభాన్ని జయించవచ్చును. కాని కోపాన్ని జయించుకోవటం అన్నిటి కంటె కష్టం. ఈ మూడు శత్రువుల్ని మీరు జయిస్తే, కామ క్రోధ లోభాల్ని అదుపు చేయ గల " హరి " తో మీరు సమానం.

మీ వ్యతిరేకులు మీ ఎడల ఎంత పరుషంగా ప్రవర్తించినా మీరు ప్రశాంతంగా వుండాలి. మిమ్మల్నెప్పుడూ విమర్శించినా, మీతో నెపాలెన్నినా, అపనిందలు మీపై మోపినా, అన్నిటినీ ఓర్పుతో సహించండి. అదే నిజమైన ధైర్యం. మానవుడు, సేన సంతటినీ తనకు లొంగునట్లు చేయవచ్చును కానీ, తన కోపాన్ని మాత్రం జయింప లేడు.

యథార్థమైన దైవ ప్రేమికుడు కోరుకొనేది ఒక్క దైవాన్ని మాత్రమే. ఇతర విషయాలన్నీ అతని ముందతి స్వల్పం. నిజమైన ప్రేమికుడు పేరు ప్రతిష్ఠలు కానీ, ధనాన్ని కానీ, కాంక్షించక కేవలం ప్రియతముని మాత్రమే కోరు కుంటాడు. అలా ఎవరైతే కోరుకోరరో వారికి స్వార్థ పరమైన అభిలాష వున్నట్లు విదితమవుతుంది.

ఆధ్యాత్మిక జీవనంలో ఎవరైనా సరే మూడు విధాలైన దశలను అనుభవించాలి. అన్వేషకుడు తనకు తెలియనిదేదో చూడాలన్నా, అనుభవించాలన్నా తీవ్రావేశం కలిగి వుండటం మొదటి

దశ. నిరాశ నిస్పృహ చెందుట రెండవ దశ. వైపానందం మూడవ దశ. మీ రిప్పుడున్న ప్రస్తుత రెండవ దశ చాలా దీర్ఘమైనది. మీరు దాని నుండి తప్పించుకోలేరు. అందుకు మరో ప్రత్యామ్నాయం లేనందున మీరు దానిని ఆనందంతో భరించాలి. నన్నెట్టి పరిస్థితులలోనూ వదలకండి.

సాక్షాత్కారమనేది అందరికీ ఒకటే. ప్రవక్తలకు, సద్గురువులకు మధ్య నున్న భేదం శక్తిలో లేదు. దానిని వుప యోగించే అధికారంలో తేడా వుంది. గట్టిగా చెప్పాలంటే సద్గురువు ఎవరికీ ఏమీ ఇవ్వడు. తనలోనే వున్న సంపదని మాత్రం కేవలం చూపుతాడు.

తన భౌతిక శరీరాన్ని పరిత్యజించిన తర్వాత ఏ సద్గు రువుకు, తన శక్తి నుపయోగించే అధికార ముండదు. గుర్తుం చుకోండి. అతనికి శక్తి వుంటుంది. కానీ దాని నుపయోగించే అధికారముండదు. మీ రెప్పుడు సద్గురు సమాధిని దర్శించినా అక్కడ ఆయన శక్తి వుంటుందని తెలుసుకోండి. అయితే, ఎవరైనా భక్తుడు ఆ సమాధిని పూజించుట వలన లాభం పొందితే, అట్టి లాభానికా సద్గురువు కారణమని పొరపాటున కూడ ఏ మాత్రం నమ్మ వద్దు.

ఇక్కడ భక్తుడు అందులోని శక్తిని వుపయోగించు కున్నాడు. తద్వారా అనుగ్రహాన్ని తనపైకి తెచ్చుకున్నాడు. ఒక సద్గురువు సజీవుడై వున్నప్పుడే యీ భౌతిక ప్రపంచంలో యితరులకు మంచి చేయకలుగుతాడు. శరీర త్యాగం చేసింతర్వాత

ఆయన ఏ ఒక్కరినీ, కనీసం ఒక భూమికను కూడ దాటించలేదు. ఎవరి సంస్కారాల్ని తుడిచి వేయలేదు. ఆయన అనంత వునికిని చవి చూచిన అనుచరులను మాత్రం వారి భక్తి వెనుక గల విశ్వాసాన్ననుసరించి, గురువు యొక్క అపరిమిత స్థితి సహాయం చేస్తుంది.

దైవసాక్షాత్కారమనేది గురువు చేతుల్లోనే జరుగుతుంది. అయితే జ్ఞానం కలగాలంటే ఒకరి కంటె ఎక్కువ గురువులను కూడ కలవ వలసి వుంటుంది. నియమం ప్రకారమైతే శిష్యుణ్ణి దైవంతో సమానంగా చేసే గురువే భౌతిక జ్ఞానం పదిలంగా వుండేట్లు చేస్తాడు. బాబాజాన్ నాకు దైవసాక్షాత్కార ప్రాప్తి కలిగించింది. జ్ఞానప్రాప్తి కొరకు నేను ఉపాశినీ మహారాజు వద్దకు పంపబడ్డాను. నా కోసరం తన ధర్మాన్ని నిర్వర్తించుట కాయనకు దాదాపు ఎనిమిదేళ్లు పట్టింది. ఈ సమయంలో నేను యితర గురువుల్ని కూడ కలిశాను. కానీ వారంతా నన్ను మళ్లీ ఉపాశినీ వద్దకే పంపారు. నేను పోగొట్టుకున్న జ్ఞానాన్ని వారు ఏ కొంచమైనా తిరిగి చేకూర్చి వుంటే, వారు కూడ నా గురువులుగా గుర్తింప బడే వారు.

ఈ ప్రపంచమంతా ఆధ్యాత్మికతకు వ్యతిరేకం. అందుకే నేనంటే కూడ వ్యతిరేకమే. ఇది నేను చాలా సార్లు చెప్పాను. నా మాటలు చేతలగురించి త్వరపడి ఒక నిర్ణయానికి రాకండి. నా మాటల యదార్థత రుజువు పరచ బడుతుంది. అయితే అది ఎప్పుడు ? ఎలా ? ఎక్కడ ? అన్నది నాకు మాత్రమే తెలుసును.

మీరు వాటిని తెలుసుకోలేరు. ఎందుచేత నంటే, అర్థం కాని
ప్రకటనల్ని తెలుసుకోవాలంటే, దైవ సంబంధమైన జ్ఞానం కావాలి.

నా ఆజ్ఞలు, వాంఛితములన్నీ ఆచరించండి. అలా
చేయుటలో మీరు బాధలు పడవలసి రావచ్చును. వాటన్నిటినీ
సంతోషంగా భరించండి. మీరనుభవించే బాధలు భరింపరానివై
నప్పుడు, మీగురువు యొక్క దృష్టిని వాటిపై మరలేట్లు చేయండి.
ఆయన మీకు సహాయపడతాడు. ఎలాంటి అసౌకర్యం కలిగినా,
మీరాయన్ను మాత్రం వదల వద్దు. అందరికీ ప్రపంచమంతా,
నాతో సహా ఆయనను వ్యతిరేకించినా సరే మీరు మాత్రం
ఆయన వైపు నిలవండి.

దైవసాక్షాత్కారం పొందిన వారిలో కొందరు నిర్వికల్ప
స్థితి నుండి మామూలు మానవస్థాయికి దిగి వచ్చి, దైవసాక్షాత్కారం
పొందే అర్హత గల వారిని ఈ ప్రపంచం నుండి తయారు చేసే
బాధ్యత కలిగి వుంటారు. అట్టివారి కున్న ఆధ్యాత్మిక సంబంధం,
సంసిద్ధతను బట్టి అర్హత వుంటుంది. కానీ అలాంటి సంసిద్ధత
అంత సులభంగా రాదు. అందుకెన్నోయుగాలు, కల్పాల పాటు
ఎన్నెన్నో బాధల ననుభవించి, త్యాగాలు చేసి, దైవసాక్షాత్కారం
పొందిన వారితో ఎంతో గాఢమైన సంబంధం వుండాలి.

ఎన్నోయుగాల పాటు వ్యథలనుభవిస్తేనే కానీ, దైవసాక్షా
త్కారం పొందేందుకు ఒక మండలిలో అనుమతించే అర్హత రాదు.
దైవసాక్షాత్కారమంటే, సంస్కారాలన్నీ నాశనం కావటం.
ఆలోచనలన్నీ అంతమై, మనస్సు పని చేయకుండా వుండే స్థితి.

ఇది రావటం చాల కష్టం. మనస్సు పని చేయకుండా ఆగిపోయేందుకు ప్రయత్నిస్తే దానిని గాఢ నిద్ర వైపు మొగ్గినట్లు చెప్ప వచ్చును. దీనినే అద్వైత్వం అంటారు. గొప్ప గొప్ప యోగులు కూడ యీ మనస్సు ఆగి పోయే స్థితికి చేరలేరు. వారు మహా అయితే, ధ్యాన సమయంలోనో, ఏకాగ్రత సమయంలోనో, లేక సమాధి స్థితిలోనో మాత్రం ఆలోచనల్ని ఆప గలుగుతారు.

అలా చేసినందు వలన కూడా సంస్కారాలు సృష్టింపబడతాయి. సమాధిస్థితినుండి వారు బయటపడగానే వారి మనస్సులు పనిచేయుటం ప్రారంభిస్తై. అంతకుముందు ఖర్చుకాకుండా మిగిలివున్న సంస్కారాలు యిప్పుడు మళ్ళీ ప్రోగవుతాయి. సాధకా యీ శరీరాన్నొక కుండతోను, ఆత్మని పొగతోను, సంస్కారాన్ని బండరాయితోను పోల్చాను. శరీరమనే కుండలో వున్న ఆత్మ అనే పొగను, సంస్కారాలనే బండరాయితో కప్పివుంచినప్పుడు, ఆ పొగ ఎంత ప్రయత్నించినా, రాయిని కదల్చలేదు. అందుకు ఒక జ్ఞాని వచ్చి ఆ రాయిని తొలగించాలి.

అదేమాదిరి పంజరములో వున్న పక్షి బయటపడేందుకు ప్రయత్నించవచ్చును. కానీ బయటనుండి ఎవరైనా సహాయపడితే తప్ప తలుపు తెరుచుకోదు. క్లుప్తంగా చెప్పాలంటే, ఆధ్యాత్మిక లాభం పొందాలన్న అభిలాష కలవారు తప్పనిసరిగా ధైర్యవంతులై, తగిలే ఎదురు దెబ్బలను తట్టుకోగల ఓర్పు కలిగి వుండాలి.

నియమ ప్రకారం, అన్వేషకుని యోగ్యత, అర్హతల ననుసరించి, వ్యక్తిగతమైన సహాయాన్ని గురువు లందిస్తారు. అయితే యిది అవతారకాలం. కాలచక్రంలో గతం అంతరించి, సరిక్రొత్త యుగం ఆరంభమైంది. నేను సర్వోన్నతుడ్ని. నా ఆజ్ఞలకు బద్ధులై నేను చెప్పినట్లు చేయండి. మానవాళికివ్వే నా ఆధ్యాత్మిక సహాయం వ్యక్తిగతంగానూ, సామూహికంగానూ వుంటుంది. నేను గురువులకు గురువును.

మామూలుగా, కాలచక్రంలో, పాత క్రొత్తల మేలి కలయికను యుగసంధి అంటారు. ఇది గురువురాకను సూచిస్తుంది. ఆయన మత పర ఆలోచనలకు పునర్జీవనం కలిగించి, నవ జీవన ప్రేరణ కలిపించును. అత్యున్నత ఆధ్యాత్మిక స్థితిని ఎంచుకొన్న ఏ కొద్దిమందికో అందిచ్చి, ప్రపంచం మొత్తానికి, ఆధ్యాత్మిక కుదుపునిచ్చును. సమీప భవిష్యత్తులో నేను ఆధ్యాత్మికతను పునరుద్ధరింపదలచాను. నేను చెప్పే యీ ఆధ్యాత్మిక ప్రసరణ గురించి, సాధారణంగా యుగాంతంలోనో యుగారంభంలోనో, క్రీస్తు చైతన్య స్థితి కెదిగిన సద్గురువు మాత్రమే విశ్వానికి చాట గలడు.

నా కార్యక్రమం అందర్నీ పట్టుకుంటుంది. జీవితపు అన్ని ఘట్టాల్లో చొచ్చుకు పోతుంది. గురువు నీటి ప్రవాహాన్ని సక్రమంగా ప్రవహించేట్లు చేస్తాడు ప్రాక్పశ్చిమ భేదం లేక అందరినీ ఒక త్రాటి పైకి తెచ్చి, మానసిక, అధిభౌతిక సహాయం అందించుట నేను చేసే మహత్తుల్లో గొప్ప మహత్తు. శిరము

హృదయం సమతూకంలో వుండేట్లు చేస్తాను. ఎవరూ భౌతిక లేక శారీరక లాభం కొరకు నా వద్దకు రావద్దు. నేనే మతాన్ని, ఆచారాన్ని సిద్ధాంతాన్ని లేదా సంఘాన్ని స్థాపించాలను కోవటం లేదు. యిలాంటి విప్పటికే, ఎన్నో స్థాపించ బడ్డయి. ప్రజలు తమ నిత్య జీవితంలోని మంచి ఆదర్శాలు గుర్తించేట్లు చేయుటకే నా రాక. హృదయానికి, మనస్సుకు మధ్య జరిగే సంఘర్షణ నివారించి భగవంతుడు మాత్రమే సత్యం, సర్వం భగవంతుడే నన్న సత్యం మీరు తెలుసుకొనునట్లు చేసి మీలో అంతర్నిహితమై వున్న ఆ సర్వోన్నతుడ్ని మీరనుభవించేట్లు చేయుట నా కార్య క్రమం. మీరెంతగా విల్లెక్కుపెట్టి నారి సారిస్తారో, అంత వేగంగా బాణం తన గమ్యం చేరుతుంది.

వ్యక్తిగతమైన, సామాజికమైన మన బాధలన్నిటికి మన స్వార్థమే కారణము. స్వప్రయోజనమును దూరము చేస్తే, మన అన్ని సమస్యలు నివారణ కాగలవు. అవతారుని రాక సమస్త ప్రజానీకమునకు తన ప్రేమ, దయ అందుబాటులో వుంచుట కొరకే. మనలో దాగియున్న దివ్యత్వమును తన చర్యల ద్వారా బహిర్గత పరచి తెలుసుకునేటట్లు చేస్తాడు. క్లిష్ట పరిస్థి తులలో భగవంతుడు మానవ రూపములో భూమిపై అవతరించు టను గురించి అన్ని మతములు చాటించిన విషయమే. హిందూ మతము యిట్టి దివ్య ప్రణాళికను గురించి మరింతగా ఘోషించు చున్నది. అవతారుని రాక నిత్యమూ జరిగేది కాదు. అరుదుగా జరిగే కార్య క్రమము. కాల చక్రము ప్రకారము 700-1400

# 21. కర్మకాండలు - మతాచారాలు

మతమంటే, వైదిక విధిని గాని, కర్మకాండలను కాని నిర్వహించడం కాదు. మంత్రోచ్చాట అసలే కాదు. మతపర ఆచారాలు, కర్మకాండలు, మంత్రాలు విలువలేనివేం కావు. వాటి వలన కొంత ప్రయోజనం వుంది. అవి కేవలం, ఒక ఫలితం సాధించేందుకు సాధనాలుమాత్రమే. దైవ సాక్షాత్కారం పొందుట మతంయొక్క గమ్యం. అయితే, మంత్రాలు చదివినందునో, మతాచారాలు, కర్మకాండలు ఆచరిస్తేనో దేముడు కనపడడు. మూఢాచారాలంగీకరిస్తేనో, వేదాలు, మత గ్రంథాలు చదివితేనో దైవాన్ని తెలుసుకోలేం.

మూఢాచారాలు, సాంప్రదాయాలు, స్వర్గ నరకాలనే లోకాచార ఆలోచనలు, ఇవన్నీ "సత్యాన్ని" తప్పుదారి పట్టించి, మనస్సును కల్లోల పెడతాయి. కర్మకాండలు, ఆచార వ్యవహారాలు, మతాచార్యుల వలన స్థాపించబడినప్పటికీ, అవి బాహ్య రూపాలపైన కేంద్రీకరించబడినయి. ఫలితంగా ఆధ్యాత్మిక జీవిత అవసరాలు మరుగున పడిపోయాయి. సద్గుణాలకు మూలమైన ప్రేమ, విధేయత, అణకువ, నిజాయితీలు, అత్యంత విలువైన, గొప్ప గొప్ప దేవాలయాల్లో వుండే పురాణాల్లో చెప్పే దేముళ్ళకు ప్రతిరూపంగా మలచబడిన విగ్రహాలు శాశ్వత జీవిత గమ్యం చేరేమార్గం మరచిపోయేట్లు చేస్తున్నాయి. మానవుడు జీవితాన్ని కోరుకుంటే ఒక రాయి ప్రసాదించబడింది.

భారతదేశం కర్మభూమి. ఇది పుణ్యభూమి. ఎందరో సద్గురువులు మతపరమైన బోధనల్ని చేశారు. అయితే వారి బోధలన్నీ జాతి కుల వైషమ్యాలు, లెక్కలేనన్ని పూజావిధానాలు మాతాచారాల మూలంగా మరుగున పడిపోయి భిన్న భావాలు ప్రస్ఫుటమౌతున్నాయి. ఇది కొన్ని వేల సంవత్సరాలనుంచి అద్భుతమైన ఆధ్యాత్మిక రీతి రివాజును సాగిస్తున్న దేశం.

ఆధ్యాత్మిక మార్గంలో సిద్ధాంతాలకంటే ఆచరణయోగ్యమైన జీవితవిధానానికే ఎక్కువ ప్రాధాన్యత వుంది. కర్మకాండల వలన వ్యక్తిగత నష్టాలేకాదు, సాంఘిక కల్లోలాలు కూడ సంభవిస్తాయి. కేవలం మూఢ విశ్వాసాలతో ఆచరించే కర్మకాండల వలన నిజమైన అవగాహన కలుగకపోగా, వాటికి తాను బంధితుడై, అన్వేషకుడు అదే సులభమైన మార్గం అనుకుంటాడు. అలా ఎన్నో జన్మలు, కర్మకాండలకు లోనై, చివరకవి నిష్ప్రయోజనమని గ్రహించి మోక్షమార్గాన్ని గురించి తపనపడతాడు.

ప్రవక్తలు సద్గురువులు తమ సన్నిహిత మండలిలో వున్న శిష్యులను ఆధ్యాత్మికంగా తమంత పరిపూర్ణులుగా తయారు చేసి అనగా దైవ సాక్షాత్కారప్రాప్తి కలుగచేసి, జనన మరణ చక్ర బంధంనుండి విముక్తి ప్రసాదిస్తారు. బాహ్యమండలిలో వున్న శిష్యులకు, భక్తి మరియు సేవల గమ్యాల్ని చూపి, కొన్ని ఆధ్యాత్మిక రహస్యాలు వారి మనస్సులో పాదుకొనేట్లు చేస్తారు. తక్కిన ప్రజాబాహుళ్యానికి వారు వివిధములైన కర్మకాండల్లో

నిమగ్నమయ్యే మతాచార సాంప్రదాయ సిద్ధాంతాల్ని బోధిస్తాయి. సూఫీమతంలో దానిని "షరియత్" అంటారు.

నిజానికి, గొప్ప సద్గురువులు, అవతారులు, సామాన్య మానవులకు బోధించిన యీ కర్మకాండల సిద్ధాంతం సరిగా అర్థం చేసుకుంటే అందులో ఎంతో ప్రాముఖ్యముంది. జోరాష్ట్రియను లాచరించే "కొష్టి" అనే సాంప్రదాయం, హిందువుల "తాళ భజన", మహమ్మదీయుల "నమాజు" క్రిష్టియనుల "ప్రార్థనలు" యివన్నీ సంస్కారాలు వదిలించుకోవటానికి చక్కని అవకాశాలు. మనసా వాచా కర్మణా సంపాదించుకొనే సంస్కారాలు, అన్వేషకుడు దైవ సాక్షాత్కారం పొందేందుకు వేసే మార్గంలో అడ్డంకులైనప్పుడు వాటిని వదిలించుకొనేందు కవి ఎంతో సహాయపడతాయి.

ఏమతం బోధించిన కర్మకాండలైనా, ఆచార సాంప్రదాయాలైనా, వాటిని ఏకాగ్రతతో ఆచరిస్తేనే తప్ప, మూఢాచారంగా ఆచరించుటవలన, అవి భగవంతుని కప్పివేస్తూ మంచికి బదులు చెడునే తెచ్చిపెడుతున్నాయి. భగవంతుడు సంకుచితపరచబడుచున్నాడు. తన పురోగతికి తానే అడ్డం కొడుతున్నాడు.

జోరాష్ట్రియనులు చేసే కొష్టి అనే శిష్టాచారం, మనస్ఫూర్తితో, హృదయస్ఫూర్తిగా నిష్కపటంతో, అచంచలమైన ఏకాగ్రతతో ఆచరిస్తే, దానివలన అట్టివారి సంస్కారాలు కొన్ని తప్పక తుడుచుకుపోతాయి. అలాకాక, ఎవరైనా రోజూ కొన్ని వేలసార్లు దీన్ని కేవలం ప్రదర్శనగానో, ఆచారాన్ని పాటించా

లనో, యాంత్రికం పాటిస్తే దానివలన ఒరిగేదేదీ ఉండదు. సరియైన భక్తి లేకుండా కొన్నివేలసార్లు దీన్ని ఉచ్చరించినా, సాధించలేని మంచి నిగ్రహంతో, భక్తితో ఒక్కసారి జపిస్తే ఎంతో మేలు చేకూరుతుంది.

హిందువులు చేసే కాళీ భజనలు, ముసల్మానులు చేసే నమాజు కూడ యీ జొరాష్ట్రియనులు చేసే "యస్న" లాంటి ఆచారాలే. ఇవి రెండూ కూడ భక్తుడి మనస్సును ప్రాపంచిక భోగాల్నుండి మరల్చి దైవంవైపు తిప్పుటకు దోహదపడతై. అయితే వీటిని ఎంతో ఏకాగ్రతతో, నిజాయితీగా, నిష్కపటంతో ఆచరించినప్పుడు వుపయోగపడతై. ప్రతివారు భగవంతుని తప్పనిసరిగా ప్రార్థించాల్సిందే. అయితే ఆ ప్రార్థన, ఒక ప్రహసనంగా లేక కసరత్తుగా మాత్రం నిర్వహించవద్దు.

గంటలేస్తూ, గొంతు చించుకొని "హరే, హరే" అంటూ సంవత్సరాల తరబడి నీవు అరచినా, ఆ అరుపులో సత్య భక్తి లేనప్పుడు, అది నీకేమాత్రం మంచి చేయదు. గంట లేస్తూ, హాప్పుటగ్గల్లో పాడటం, తాళం వేయడం ఇవేవి నిన్ను దైవం చెంతకు చేర్చవు. నీ ఆధ్యాత్మిక ఉన్నతికి కావాల్సింది భక్తి. అంతేకాని, యాంత్రికంగా మంత్రోచ్చారణతో చేసే పూజకాదు.

ఏమతం వారైనా, ఆయా మతాలు నిర్దేశించిన శిష్టాచారాల్ని పాటిస్తున్నారంటే ఆయా శుభసమయాల్లో తమ ధర్మాన్ని పాటిస్తున్నారేకాని, దైవంవైపు మనస్సును లగ్నం చేయలేక

పోతున్నారు. ఒక జోరాష్ట్రియను "యష్ట" అనే తమ మత గ్రంథంలోని ప్రార్థనలు చేసేప్పుడు, ఎన్ని పేజీలు చదివానని లెక్కిస్తూ ఎప్పుడు పూర్తవుతుందా అని ఆదుర్దా పడతాడే తప్ప, ఆ ప్రార్థనలో లీనం కాలేడు. పాపం అతడు భగవంతుని గురించి ఆలోచించడు. అతి తొందరగా దానినుండి బయట పడాలని చూస్తాడు. పార్శీ పురోహితులు ప్రార్థనలు చేస్తూ మధ్యలో బజార్లో అమ్మే కూరగాయల ధరలు విచారించుట మీకు తెలుసా? భోజనం ముందు కూర్చున్న శిష్టాచార సంపన్నులు, అపుపోసన పట్టి, దైవ నివేదన చేయుటకు ముందు, ఘుమఘుమ లాడే మృష్టాన్న భోజనాన్ని కళ్ళార్పకుండా చూడటం మీకు తెలుసా?

బాగా జ్ఞాపకం వుంచుకోండి. మీ హృదయఫలకంపై వ్రాసుకోండి. భక్తి లేకుండా చేసే ప్రార్థనలు, కర్మకాండలు, ఇటు భౌతికంగాను, అటు స్వర్గపరంగాను కూడ ఉపయోగపడవు. కర్మమార్గంనుండి మోక్షమార్గంలో ప్రవేశించాలంటే, మూఢ విశ్వాసాలతో ఆచరించే కర్మకాండలు నుండి విముక్తి పొంది, నమ్మిన సత్యాన్ని నిస్సంకోచంగా ప్రేమతో ఆచరించాలి.

దైవసాక్షాత్కారం పొందిన కొందరు గురువులు అవతారుని కార్యభారాన్ని తమవంతు కార్యక్రమంగా నిర్వర్తిస్తూ, వేర్వేరు గురువులు వేర్వేరు మతాలు స్థాపించారు. మానవాళిని వివేక వంతుల్ని చేయటమే అవతారుని ఏకైకలక్ష్యం. సద్గురువులు చేసే

బాహ్యమైన, అంతర్గతమైన అన్ని చర్యలు యీ లక్ష్యసిద్ధి కొరకే.

హిందూధర్మంలో వ్యక్తిగత సాధనలో ఏకాగ్రతకు ఉపకరణలుగా, విగ్రహాలు నిర్దేశింపబడ్డాయి. హిందూ మేధస్సు, ఆరాధించే ప్రతిరూపంపైకంటే, దాని వెనుక వున్న శక్తి అన్నిటికంటే గొప్పదని ఆరాధించే తత్వం కలది. విగ్రహారాధనను, భారతీయులు శ్రద్ధతో చేస్తారు. నిజానికి విగ్రహం అంటే గ్రహించుటని అర్థం. గ్రహించేదేమిటి? యిష్టదేవతయొక్క ప్రతిరూపం. భక్తి శ్రద్ధలతో పూజించి, ఆ దేవతా విగ్రహం వెనుక వున్న శక్తిని గ్రహించుటద్వారా ప్రస్ఫుటమైన సత్యాన్ని చేరవచ్చును. అలా చేయకలగాలంటే, మనస్సును పూజలో లగ్నంచేసి, యిష్టదేవతపైనే కేంద్రీకరించాలి. అలాకాక, కేవలం మతపర ఆచారాన్ని పాటించుటకు యాంత్రికంగా పూజాదికాలు నిర్వహిస్తే ఆధ్యాత్మికంగా ఒనగూడేదేమీ వుండదు. అవి కేవలం పటాటోపంతో చేసే ప్రదర్శనలుగానే మిగిలిపోతయి.

సద్గురువుకు విధేయుడై, పరిపూర్ణ విశ్వాసం కలిగివుంటే జీవితలక్ష్యం సిద్ధిస్తుంది. గురువుయందు విశ్వాసముంచినవారు, మోక్షమార్గంలో పయనించటమేకాక, జీవితంలో ఎదురయ్యే ఒడుదుడుకులను విజయవంతంగా ఎదుర్కొనగలరు. గురువు తనకు సన్నిహితంగా వుండే అంతరంగిక మండలిలోని శిష్యులలో అదృష్టవంతులైన కొందరికి ఆధ్యాత్మిక పరిపూర్ణత కలిగించి తమంతవారిగా చేయుదురు. బాహ్యమండలిలోని శిష్యులలో కొందరిని వివేకవంతుల్ని ప్రజ్ఞావంతుల్ని చేస్తారు. తక్కిన మానవులందరికీ ఒక ఆధ్యాత్మిక కుదుపు నందిస్తారు. కొన్ని

నియమాల్ని ధర్మాల్ని ప్రబోధిస్తారు. అవే, మతపరమైన ఆచారాలుగా మిగిలి, క్రమంగా ఆయా మతాలవారిచే ఆచరించబడుతున్నాయి. ఎవరికీ ధర్మాల్ని అత్యంత భక్తి శ్రద్ధలతో పాటిస్తే దైవసన్నిధికి వేరే మార్గంలో పోనవసరం. అలా కాక, యాంత్రికంగా జరిపినప్పుడు, అవి ఓ తమాషాగా మిగిలి నిష్ఫలమౌతాయి.

నీవు నీమతాన్ని విడిచిపెట్ట నవసరంలేదు. బియ్యపు గింజపై వుండే పొట్టువంటి మతకర్మలను పట్టుకొని ప్రేలాడుట వదిలేయి. కర్మకాండలలో చిక్కుకున్న వ్యక్తి ఆధ్యాత్మిక మార్గాన్ని దూరం చేసుకుంటాడు. సద్గురు చరణ సన్నిధిని చేరినవారికి మత కర్మలతో పనిలేదు. మత కర్మకాండ నిజమైన మతానికి బయట కప్పువంటిది. మత కర్మలు, ధ్యానము, పూజ, తపస్సు యివేవీ ప్రేమను పుట్టించలేవు. అవతార యుగంలో అవతారుని అనుగ్రహాన్ని పొందిన్నట్లైతే, నీవు చేరుకోవలసిన స్థానాన్ని క్షణాల్లో ఆయనే చేరుస్తాడు.

నా ప్రేమికులకు, మత కర్మకాండ అవసరం లేదనీ, నన్ను ప్రేమించమని నేను ఎప్పుడూ చెప్తూనే ఉన్నాను. యుగాలెన్నో వచ్చాయి, పోయాయి. కొంచెం, కొంచెం భగవంతుణ్ని ప్రేమించమని ఎంత చెప్పినా వారు భగవంతుని బయటనే అన్వేషిస్తున్నారు. నేనందరికీ యిచ్చే మతం భగవత్ప్రేమ మతం. నేను బాహ్యంగా కనిపించే అన్ని మత కర్మకాండల బంధాల్ని ధ్వంసం చేయదలచాను.

జపాలు, తపాలు, మంత్రాలేవీ దైవం వినడు. ప్రేమతో కూడిన హృదయభాషనే వింటాడు. సర్వాంతర్యామియై, అంతటా నిండి నిబిడీకృతమైయున్న భగవంతుని చూచునట్లు చేయగల

మనోవైఖరి నందింపేదే నిజమైనమతం. కొందరు మరణించిన వారికి చేసే అపరకర్మలుకూడ శ్రద్ధనమ్మకంతో చేసేవే. ఎన్నో సంవత్సరాలక్రితం మరణించినప్పటికీ, అజ్ఞానాంధత్వంలో మరణించిన వారియందుగల గౌరవభావంతో అమితశ్రద్ధ చూపి, శ్రాద్ధకర్మలు నిర్వహిస్తున్నారు. మరణించినవారిక లేరు. వెళ్ళి పోయారు. మరెందుకివన్నీ? మరణించిన తర్వాత వారి ఆత్మ మూడురోజుల వరకు దేహం విడిచినచోట గాలిలో తిరుగుతూ ఉంటుంది. కావున చేయవలసిన కర్మలేవైనా ఆ మూడురోజులలో చేయాలి. భగవన్నామస్మరణ, పురాణేతిహాసములపఠనం వలన మరణించిన వ్యక్తికి సంస్కారబంధాల్నుండి స్వేచ్ఛ కలుగుతుంది. అలాకాక ఏడుస్తూ కూర్చుంటే, మమకారబంధం మరింత బలపడుతుంది.

ప్రపంచమతాలన్నిటిలోను మతకర్మ ప్రధానముంది. దీనినుండి విముక్తి కలిగించుటకు ప్రియతముడు తరుణోపాయాలెన్నో స్పష్టీకరించారు. తన జీవితకాల పరిసమాప్తి దశలో మనోనాశ కార్యక్రమం చేపట్టారు. చివరలో మెహెరాబాదులో నిర్మించిన మనోనాశ కుటీరం వెనుకభాగాన ఒక గొయ్యి త్రవ్వించి, అందులో ధుని వెలిగించారు. అంతకుముందో కాగితంపై "ప్రపంచమునందలి సర్వమత కర్మకాండలు, మానవుని పేరాశ, స్వార్థం, సమస్త ద్వేషాల్ని యీధునిలో పారేస్తున్నాను" అని శిష్యులతో వ్రాయించి, ఈరుచ్‌తో బిగ్గరగా దానినిచదివించి, బాబా ఆ కాగితాన్ని ముక్కలుగా చించి, ఆధునిలో అగ్నికి ఆహుతి చేశారు. అగ్ని చల్లారిన తర్వాత బూడిదనంతా డబ్బాలలోకెత్తి బాబా స్వయంగా సీళ్ళువేసి, వాటినెన్నడూ ఉపయోగించవద్దని ఆదేశించారు.

# 22. శారీరక రుగ్మతలు - నివారణోపాయం

మిమ్ములను మాయ అనే ఇనుప పంజరం నుండి బయట వేయుట నా విధి. ప్రతి వారిని మాయా బంధముల నుండి విముక్తి చేయుట. మరి, నేనలా చేయునప్పుడు, నేను మాయ నుండి వ్యతిరేకతను ఎదుర్కోవలసి వస్తుంది. మాయ నన్నలా విముక్తి చేయనీయదు. ఎందుకో తెలుసా? ప్రతి పనిని, నియమం ప్రకారం, కావాలని మాయ చేయదు. అంతా యాంత్రికంగా జరిగిపోతుంది. మాయ బంధాల నుండి నేను మానవులను ఎంతగా విడుదల చేస్తే, అది అంతగా తన వైపు లాగి వ్యతిరేకత సృష్టిస్తుంది.

ఆధ్యాత్మిక ప్రపంచంలో అన్ని నియమాల్ని అదుపు చేయ గల ఏకైక శక్తి భగవత్శక్తి. అదే ఆయన కృప. అది అన్ని నియమాలకు అతీతమైనది. యీ విశ్వ సృష్టి ఒక మహత్తు. యీ సృష్టిలో ఒక దాని పైన ఒకటి, ఎన్నో నియమాలున్నాయి. అవన్నీ ఒక దాని నొకటి పర్యవేక్షిస్తాయి. ప్రకృతిలో మొట్ట మొదటి నియమం కార్య కారణ నియమం. ఇది అత్యున్నత నియమం. ఇట్టి సహజ నియమం మానవ జీవితంపై రింపరానిదై కఠోరము, నిష్టురంతో కూడి, యాంత్రికంగా జరిగి పోతుంది. అయితే జీవిత ఒత్తిడిలో జరిగే క్రియ, ప్రతి క్రియ లందు ఇట్టి సహజ నియమాలు వున్నత సంస్కారాల్ని కల్పిస్తాయి. వీటినే జీవుని గత జన్మల సంస్కార ఫలితాలంటారు.

సంచిత, ప్రారబ్ధాలు, యీ జన్మలోని ఆగామి యివన్నీ కర్మ ఫలాలే ! వీటన్నిటినీ జీవుడు అనుభవించుట ప్రకృతి సంస్కార విధానం.

ఉదాహరణకు ఆరోగ్యకరమైన ఆహారం తినుట మాని, అపథ్యాహారం తింటే భౌతిక శరీరం, జీవిత కాలం కంటే ముందే ఎలా కృశించి నశించి పోతోందో, అలాగే, నియమోల్లంఘన చేస్తే కర్మ సిద్ధాంతంలో మునిగి తేలుతూ వుంటాడు. అందువలన, జీవుడు తాను సంపాదించుకున్న కర్మలు, అనుభవించక, సహజ కర్మలకతీతుడై, మహాత్ముల ద్వారా ముక్తిని సాధించలేడు. అసహజ నియమాల కతీతంగా వాటిని ధిక్కరించి, తెలియని ఏవో సహజ నియమాల ద్వారా చేసే మహత్తులు శాశ్వతమైనవి కాబోవు. అసహజమైన అట్టి చర్యలు ప్రకృతి కనుగుణ్యంగా వుండక, గారడీగా మిగిలి పోతయి. ఏమైనప్పటికీ, యీ అన్ని నియమాలకు అతీతమైన శక్తి భగవత్శక్తి.

భగవంతుడు తప్పులను క్షమిస్తాడు. దీని అర్థం, జీవులను ఎప్పుడూ తప్పులు చేస్తూ వుండమని కాదు. ముక్తి మార్గ కవాటాన్నాయన ఎప్పుడూ తెరిచే వుంచాడు. అవిచ్ఛిన్నంగా కర్మ సిద్ధాంతంలో పడి కొట్టుమిట్టాడి, వదలక ప్రార్థనలు చేస్తూ ఆయన కృపకు పాత్రులైన వారికి, ఆ మార్గం సుగమమవుతుంది. దైవాన్నర్థించే క్షమార్పణ, ఆయనలోని కృపను మేల్కొలుపు తుంది. అందుకు పరిశుద్ధ ప్రేమ కావాలి.

ఆ కృపే, కర్మ బంధాల నుండి విముక్తి ప్రసాదిస్తుంది. కనుక ఏకైక మహిమంటూ ఏదైనా వుంటే, అదే దైవకృప.

దానికి అవధులు లేవు. యావత్తు విశ్వాన్నది భరించ గలదు. ప్రపంచ నియమాల్నంటినీ అమపు చేయగల శక్తి ఆ కృపకే వున్నది. వర్గీకృత నియమాలన్నిటిలో ఆఖరిది, అత్యుత్తమమైనదీ అదే. యీ ప్రకృతితో దైవ కృపకు సంబంధం లేదు. అది ఒక జీవి కివ్వబడే ముక్తి. ఆధ్యాత్మిక పరిపూర్ణత్వానికి సంబంధించినది.

యీ సందర్భంలో బాబా మరో విషయం చెప్పారు. "అకాలంలో ప్రాప్తించే శారీరక రుగ్మతలు, ఆధ్యాత్మిక స్వాస్థ్యత సిద్ధించుటకొరకేనని గ్రహించండి. శారీరక, మానసిక బాధలు ఒక వ్యక్తికి, ఆధ్యాత్మిక స్వాస్థ్యత సంప్రాప్తించుట కనుకూలించును. శారీరక, మానసిక బాధలు భగవంతుడిచ్చే కానుకలుగా తెలుసుకొనుడు. వాటిని మీరు సంతోషంతో స్వీకరిస్తే, అవి మిమ్ములను అనంత శాశ్వతానందానికి చేర్చును.

సాముహికంగా, మానవాళికి ఆత్మసాక్షాత్కారం చేయించుట కవసరమగు, ఆధ్యాత్మిక అవసరములప్పుడు తప్ప, మహిమలు చేసినచో, అవి అసహజమై ప్రకృతివిరుద్ధమై భగవంతునిచే నిర్దేశించబడిన పరిణామ క్రమ విధానంలో జోక్యం కల్పించుకోవటమవుతుంది.

అయితే మహిమలనేవి, అవి చేయబడే సమయాల్లోవున్న పరిస్థితులపై ఆధారపడి వుంటయి. భగవంతుని కుటుంబంలో నిజానికి అనంతమైన బిడ్డలున్నారు. అయినా వారెవ్వరూ ఆయనను చూచురీతిలో చూడలేకున్నారు. యీ యావత్తు జగత్తులో

ఏ కొద్దిమందో నన్ను చూడకలుగుచున్నారు. తక్కినవారంతా కేవలం యీ మాయనే చూస్తున్నారు. అయితే నన్ను స్పృశించుటయో, ఆలింగనం చేసుకొనుటయో చేసినచో అది చెప్పలేనంత అదృష్టం. ఫలితం మీరెరుగలేకున్నారు.

నేను అందరినీ ప్రేమిస్తాను. బాగా జ్ఞాపకముంచుకొనండి. నేను ఎట్టి మహిమలు చేయకున్ననూ, ఎవరు ఏది అడిగినప్పటికీ, అది వారి హృదయాంతరాళము నుండి అడిగినచో నేను యివ్వగలను. నేను బాబానే అయినచో నేనేదైనా చేయగలను. మీరు హృదయపూర్వకంగా అడిగితే దానిని నా నుండి పొందగలరు. పరిశుద్ధ ప్రేమకు ఏ నియమం అడ్డురాదు. గాఢనిద్రలో కూడ శ్వాస పీల్చి వదలునట్లుగా నన్ను ప్రేమించినప్పుడు మీరు నా ప్రేమను పొందగలరు.

మానవులు శారీరక, మానసిక బాధలు వ్యక్తిగతంగానూ, సామూహికంగానూ పొందుతున్నప్పుడు వారు తక్షణ బాధానివారణను, ఆకాంక్షిస్తారు. సుఖ దుఃఖాలనే ద్వందానుభవాలపైనే మానవుని పీడ వుంటుంది. ఒకదానిని వదిలించుకొనుటకు మానవుడు చేయగలిగినంతా చేసిన ఫలితంగా రెండవ దాన్ని పొందుతున్నాడు. అయితే బాధను మాత్రం వదులుకోలేడు. సుఖం దుఃఖం యీ రెండూ విడదీయరాని జంట. అనేక కోరికలు ఆకాంక్షల వల్ల జనించినవి. ఒకటి ఎక్కడ వుంటే రెండవది కూడ సహచరునిగా అంటిపెట్టుకొనే వుంటుంది. సుఖంలో

దైవం గుర్తురాదు. అంతా మీ ప్రతాపమే ననుకుంటారు. కష్టాల్లో దైవం గుర్తొస్తాడు.

అందువలన మానవుడు పరస్పర వ్యతిరిక్తములైన యీ రెంటి అంతర్గత ఆదిలో పట్టుబడుతున్నాడు. ఇదే జీవిత నాటకం. నేను మళ్ళీ చెపుతున్నాను. నేను సర్వోన్నతుడను. నా యిచ్ఛయే చట్టము కాగలదు. నా ప్రేమ యీ విశ్వాన్ని భరిస్తుంది. మీకు సంభవించే కష్ట నష్టాలు, వచ్చే శారీరక రోగాలు, బాధలు అన్నీ నా ప్రేమయొక్క ఫలితాలే. చివరికవన్నీ సత్ఫలితాలిస్తాయి కనుక మీరు నన్ను మీరున్న స్థితినుండి తప్పించమని అర్థించక, నను ప్రేమించే రీతిలో ప్రేమించండి. నన్ను జ్ఞప్తి వుంచుకోండి నన్ను హృదయపూర్వకంగా స్మరించండి. మీరు శాశ్వత సుఖము బడయగలరు. నాకు కావలసింది పరిశుద్ధ ప్రేమ.

మన తృప్తి కొరకు, లేదా మన కోరిక తీర్చుటకు ఏదైనా మహిమలు చేయకపోయినా, అనుభవంలో ఆయన కృపకు పాత్రులమైనప్పుడు ఆయనను ప్రేమించవలసిన రీతితో ప్రేమించినప్పుడు, ఆయనపై పరిపూర్ణ విశ్వాస ముంచినప్పుడు, శారీరక రుగ్మత లెంత ప్రమాదకరమైనవి సంభవించినా, మబ్బు తెరలా ఎలా విడిపోతాయో ఒక చక్కని సంఘటన గురించి తెలుసుకుందాం.

సోదరులు తాడేపల్లి బసవయ్యగారు అవతార్ మెహెర్ బాబా మచిలీపట్నం సెంటరు అధ్యక్షులు. ప్రముఖ బాబా ప్రేమి

కులు. గత మూడు దశాబ్దాలుగా ఆయన బాబా దర్శన, స్పర్శ, ఆలింగన భాగ్యాలు పొందిన అదృష్టవంతులు. ఆయన జీవితంలో కుటుంబరీత్యా ఎన్నో బాబా అనుభూతులు పొందిన భాగ్యశాలి. అనుక్షణం బాబా స్మరణతో తన విద్యుక్త ధర్మాన్ని ఆచరించే ప్రముఖ పారిశ్రామికవేత్త. వినీతవ్రముఖులు, దయా దాక్షిణ్యాలతో, దాన ధర్మాలతో ఆదర్శప్రాయ జీవితాన్ని కొనసాగిస్తున్నారు.

1984 ఆగస్టు 31వ తేదీన కవియోగి, మహర్షి శుద్ధానంద భారతి నుండి ఒక లేఖ వచ్చింది. పరిస్థితులన్నీ గందరగోళంగా వున్నాయని, అశాంతి అలుముకొని వున్నదని, అయితే అంతలో బాబా దయవలన అంతా సుఖాంత మవుతుందని వ్రాశారు. ఆ రోజున దాని అంతరార్థం అవగాహన కాలేదు. రెండు రోజులు గడిచాక, సెప్టెంబరు రెండవ తేదీ వుదయం శ్రీ బసవయ్యగారు కొత్తగా కొన్న పొలానికి స్కూటరుపై వెళ్ళి చేనంతా తిరిగి మచిలీపట్నంలో వున్న తమ బంధువుల యిళ్ళకు కూడా వెళ్ళి పరామర్శించి చివరకు వారం వారం జరిగే బాబా సెంటరు కార్యక్రమంలో పాల్గొని సుమారు గం॥ 11-30 ని॥లకు తమ ఫ్యాక్టరీకి చేరారు.

అంతకు ముందు ఒక వారం రోజులుగా కొంచెం వుదర సంబంధమైన "గ్యాస్" ట్రబుల్‌తో తగు వైద్యం చేయించుకుంటున్నారు తప్ప నలతనేది ఎరుగరు. అయితే యీ రోజున గం॥ 11-30 ని॥ల ప్రాంతంలో హఠాత్తుగా గుండె పోటుకు

చిక్కుకున్నారు. క్షణాల్లో స్పృహ కోల్పోయి అచేతనులై పోయారు. ఒళ్ళంతా చల్లబడి పోయింది. పరిస్థితి ప్రమాద స్థాయికి చేరుకుంది. వారి కుటుంబమంతా బాబా ప్రేమిక పరివారమే. ముందుగా బాబా నామస్మరణ వారి వంతైంది. సతీమణి సీతమ్మగారు, పిల్లలు హృదయావేదనతో బాబా శరణు కోరారు. బాబాకు హారతిచ్చి ప్రార్థన చేశారు.

వారి సోదరులు శ్రీ తాడేపల్లి హనుమంతరావుగారు బాబా నిర్ణయమా అన్నట్లు ఆరోజు విజయవాడనుండి వచ్చి యింట్లోనే వుండుటతో సరియగు సమయంలో డాక్టరును వెంటనే తీసుకురావటం, సమయం మించకుండా అవుసరమగు వైద్య సహాయం అందటం అంతా క్షణాల్లో జరిగిపోయింది. మూడు రోజులకు గానీ శ్రీ బసవయ్యగారికి పూర్తి చైతన్యం రాలేదు.

దరిమిలా విజయవాడనుండి కూడ ప్రముఖ నిపుణుల్ని పిలిపించి పరీక్ష చేయించారు. వారు కూడ ఇది గుండె పోటని నిర్ధారించి పదిరోజులపాటు పూర్తి విశ్రాంతి అవుసరమని చెప్పారు. ఇందరు డాక్టర్లు అది గుండె పోటని నిర్ధారించినా కుటుంబ సభ్యులంతా జరిగిన ప్రమాదానికి గాబరాపడి, ఆయన ఆరోగ్యం బాగుపడాలని, త్వరగా కోలుకొనునట్లు ఆశీర్వదించమని బాబాను ప్రార్థిస్తూ, ఆయనకు పూర్తి విశ్రాంతి కలిగించాలని జాగ్రత్తపడుతుంటే శ్రీబసవయ్యగారు మాత్రం అసలు తనకేమి జరగలేదని కాకపోతే కాస్త నీరసంగా మాత్రం వుందని అంటున్నారు.

అంతేకాదు. ఇదంతా దైవనాటకంలో అంతర్భాగం. జరుగవలసిందాయన యిచ్ఛ ప్రకారం జరిగింది. ఇందుకు నేను నిమిత్త మాత్రుణ్ణి. ఇది నాకు బాబా ఇచ్చిన బహుమతి. అందుకే సంతోషంగా అనుభవిస్తానంటున్నారు. సెప్టెంబరు 5వ తన 67వ జన్మదిన వేడుకను అంత బాధలోనూ సాదర సత్కారాలతో ఆనందంగా జరుపుకున్నారు.

ఇంకా పూర్తి స్వస్థత చేకూరలేదు. అయినా ఆయన బాబా నామోచ్చారణ మాత్రం మానలేదు. ఆ నమ్మకమే ఆయనకు వరమై గుండెకు అడ్డుదా కలగచేసే వ్యాధి వివరం తెలియనీయకండా మనస్సును బలపరచే శక్తినిచ్చింది. ఇది బాబా కృప. సత్వరమే ఆయన ఆరోగ్యం కుదుటపడి ముందు ముందు ఇతోధికంగా బాబా సేవా కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొనునట్లు బాబా ఆశీర్వచనాల నర్థిస్తున్నాను.

—: జై బాబా :—

## శ్రీ జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు
### ఇతర రచనలు

| | | | |
|---|---|---|---|
| 1. | మెహెర్ కథామంజరి మొదటి భాగం | | 3.00 |
| 2. | మెహెర్ కథామంజరి రెండవ భాగం | | 3-00 |
| 3. | మెహెర్ మండలి | | 5-00 |
| 4. | నవజీవనం | మొదటి భాగం | 5-00 |
| 5. | నవజీవనం | రెండవ భాగం | 5-00 |
| 6. | నవజీవనం | మూడవ భాగం | 5-00 |
| 7. | మెహెర్ మందారం (వారం వారం వెలువడిన ప్రచురణల సంకలనం) | | 4-00 |

కాపీలకు :

అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు

మచిలీపట్నం

మరియు

శ్రీ జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు

29-36-12, మ్యూజియంరోడ్డు, విజయవాడ-2

ముద్రణ : స్పందన ప్రింటర్స్, మచిలీపట్నం

106

